# విజ్ఞానసరస్వతి

Volume - 6 July - December 1989 No. 2

# VIJNANA SARASWATI

A Half Yearly Oriental Reasearch Journal in Telugu



Chief Editor
**Dr. V.V. Krishna Sastry,** M.A. Ph.D.
Director
**The Andhra Pradesh Government**
Oriental Manuscripts Library &
Research Institute, Hyderabad - 1

# విజ్ఞాన సరస్వతి
# VIJNĀNA SARASWATI

A Half Yearly Oriental Reasearch Journal in Telugu
*The Andhra Pradesh Government*
*Oriental Manuscripts Library & Research Institute.*

Editor
**Dr. S. Radha Krishna Sastry, M.A.M.O.L. Ph.D.**

**D.K. Srinivasa Chary, M.O.L.**









Chief Editor
**Dr. V.V. Krishna Sastry, M.A. Ph.D.**

Director
**The Andhra Pradesh Government**
Oriental Manuscripts Library &
Research Institute, Hyderabad - 1


**Volume 6**
**Number 2**

July - December
1989



URI LIBRARY
TIRUPATI


# విషయ సూచిక

# మేఘసందేశము

## ద్వితీయ సర్గ

### అనువాదకుడు :

### శ్రీ మానికొండ సత్యనారాయణ శాస్త్రి

(గత సంచిక తరువాయి)

53. ఆశ్వా స్యైవం ప్రథమ విరహాదగ్రశోకాం సఖీంతే
శైలాదాశు త్రినయన వృషోత్ఖాత కూటాన్నివృత్తః
సాభిజ్ఞాన ప్రహిత కుశలై స్తద్వచోభి ర్మమాపి
ప్రాతః కుంద ప్రసవ శిథిలం జీవితం ధారయేథాః ॥

ఇట్లోదార్చి యపూర్వ దుర్విరహ శోకార్తన్ సఖా నీసఖిన్
వే రమ్మిచ్చటి కా త్రినేత్ర వృషభోత్ఖాతాద్రి నిన్ వీడుచున్
సాఽ భిజ్ఞానము నాపె చెప్పు కుశలింపున్ మాటలన్ దెచ్చుచున్
ప్రాతః కుంద సమంబు దుర్బలము నా ప్రాణిన్ సహా నిల్పుమా ॥

54. కశ్చిత్సౌమ్య వ్యవసిత మిదం బంధుకృత్యం త్వయామే
ప్రత్యాదేశా న్నఖలు భవతో ధీరతాం కల్పయామి
నిశ్శబ్దోఽపి ప్రదిశసి జలం యాచితశ్చాతకేభ్యః
ప్రత్యుక్తంహి ప్రణయిషు సతా మీప్సితార్థ క్రియైవ ॥

సౌమ్యా! నీవిదె పూనితే యనుడు నా యి బంధు కృత్యం బికన్
నీ ధీరోన్నతి సంశయించు టగుగా నే నీ బదుల్ కోరినన్
నిశ్శబ్దంబుగ గాదె చాతకము యాచింపన్ జలం బిత్తువౌ
అర్థుల్ కోరిన కోర్కె దీర్చెదరె కానీ సజ్జనుల్ ప్రేలరౌ ॥

55. ఏతత్కృత్వా ప్రియ మనుచితం ప్రార్థ నాదాత్మనో మే
సౌహార్దాద్వా విధుర ఇతివా మయ్యను క్రోశ బుద్ధ్యా
ఇష్టాన్దేశాన్ జలద విచర ప్రావృషా సంభృతశ్రీ
ర్మా భూదేవం క్షణ మపిచతే విద్యుతా విప్రయోగః ॥

విజ్ఞాన సరస్వతి

ఏతత్ కార్యము మిత్ర నీ కనుచితం బే యయ్యు నా ప్రార్థనన్
నాపై జాలినొ సౌహృదంబుననొ విశ్లేషుండ నే నంచునో
నీవీ నా ప్రియమున్ బొనర్చి యిక ప్రావృట్ సంభృతశ్రీరుచిన్
నీయిచ్చన్ విహరింపు దేశముల నీ విద్యుత్కళత్రంబుతో
నా కట్టుల్ క్షణమేన్ వియోగ మదినీకొన్నెందు లేకుండుతన్.

56. తత్సందేశం జలధరవరో దివ్యవాచా చచక్షే
ప్రాణాం స్తస్యా జనహితరవో రక్షితుం యక్షవధ్వాః
ప్రాప్యోదన్తం ప్రముదిత మనాః సాపితస్థౌ స్వభర్తుః
కేషాం నస్యాదభిమత ఫలా ప్రార్థనా హ్యుత్తమానామ్.॥

తత్సందేశము నా పయోద వరుడా యక్షాంగనా ప్రాణముల్
బ్రోవన్ జెప్పెను దివ్య వాక్కుల జనశ్రోత్రానుకూల ధ్వనిన్
ఆ యక్షాంగనయున్ స్వభర్తృ కుశలంబున్ వించు మోదించెనొ
ప్రార్థింపన్ ఘనులన్ ఫలింప కెటులుండున్ ప్రార్థనల్ ఏరికేన్.

57. శ్రుత్వా వార్తాం జలద కథితాం తాం ధనేశోఽపి సద్యః
శాప స్యాన్తం సదయ హృదయః సన్నిధాయాస్త కోపః
సంయోజ్యైతౌ విగళిత శుచౌదమ్పతీ హృష్టచిత్తౌ
భోగానిష్టా నభిమత సుఖాన్ ప్రాపయామాస భూయః ॥

జాలిన్ గొల్పెడి వార్త యా జలదు నోటన్ వించు విత్తేశుడున్
రోషంబాగి దయాంతరంగుడయి శాపాంతంబు గావించి తా
గూర్చెన్ దంపతులన్ మనంబు లిగురొత్తన్ వారికిన్ భోగముల్
పూర్వం బట్టుల గల్గజేసెను నభీష్టంబుల్, కడున్, సౌఖ్యముల్.

ఉత్తరమేఘం సమాప్తం

మేఘ సందేశం సర్వం సమాప్తం

# జక్కన విక్రమార్క చరిత్ర

## కథలు – మూలము

డా. నీరజా చక్రవర్తి, ఎం.ఏ, పిహెచ్.డి.

(గతసంచిక తరువాయి)

ఆమె మహాధనవంతుడగు బ్రాహ్మణుని సతి. వ్యభిచారిణియై భర్తను దరికి రానీకుండెను. ఆతడు యావజ్జీవమును కామ సంతప్తుడుగనుండి, దేహావసాన సమయమున "వేణు వన వాసియగు రాక్షసుడను దినమును నిన్ను బలాత్కారము చేయవచ్చి బాధించు"నని శపించెను. ఆమె పశ్చాత్తాపముతో నాతని బ్రార్థింప నాతడు "మహాపురుషు డొక్కడు వచ్చి యాతని సంహరించువరకును నీవట్లు బాధపడుము. ఆ మహాపురుషుడా రాక్షసుని వధించి నీకు విముక్తి గల్పించు"నని విమోచనమును గూడ దెలిపి మరణించెను. ఆమె పై విధముగ దన కథయంతయు జెప్పుకొని, తనదియగు నవ ఘట పరిపూర్ణ సువర్ణమున్న స్థలమును రాజునకు దెల్పి, ప్రాణములు త్యజించెను. రాజాధనమంతయును వెలికిదీసి పురందరునకిచ్చెను.

ఈ కథలోని శాపగ్రస్తమగు స్త్రీ వృత్తాంతము జక్కన కావ్యమున మార్పులతో నున్నది. కమలావతి యను నచ్చరలేమ యుగ్రశ్రవసుడను మునికి తపోభంగము చేయుటకై సఖులతో వచ్చి, పుష్పాపచయము నెపమున నాతని యెదుట సౌందర్య ప్రదర్శనము చేయు చుండెను. దీనిని మానసమున గాంచిన మునీశ్వరుడు రాక్షసులచే నామె బాధింపబడునని శపించెను. ఆమె దుఃఖముతో శాపవిముక్తిని వేడ, విక్రమార్క చక్రవర్తి వచ్చి యా రాక్షసుల సంహరించి యామెను విడిపించునని యనుగ్రహించెను. ఆ విధముగనే పురందరుని వలన నొక స్త్రీ రక్కసులచే బాధితయగు చున్నదని వినిన విక్రమార్కుడు అటకు వచ్చి యామెను గాపాడెను. ఆమె తన శాపవృత్తాంతమును జెప్పుకొని, విక్రమార్కుని కంతులేని ధనము నిచ్చు నొక మహనీయ మణినిచ్చి వెడలిపోయెను. విక్రమార్క డామణిని పురందరున కిచ్చెను. ఈ శాపవృత్తాంతము తప్ప పురందరుని దానధర్మముల కథ రెండు భాషల కావ్యములందు నొక్కటే.

సంస్కృత గ్రంథమున శాపగ్రస్తకు విముక్తి కల్గించు మహాపురుషు డెవ్వడు తెలుపబడలేదు. జక్కన విక్రమార్కుడే యాతడని చెప్పెను. తెలుగు గ్రంథములందలి ముఖ్యమైన మార్పు కమలావతి విక్రమార్కున కిచ్చిన మహనీయమణి కల్పన. ఎంత ధనమిచ్చినను దానధర్మములకై వెచ్చించు స్వభావముగల పురందరుడు త్వరలోనే మాధనమును ఖర్చు పెట్టును. మరల దరిద్రుడై యాచింప వలసి వచ్చును. అందువలన జక్కన యెల్లప్పుడును సంపదలిచ్చు మహనీయ మణిని సృష్టించెను. ఇందుచే బురందరుని ధానధర్మములు నిరాటంకముగ నిరంతరము సాగు చుండును.

11. పదునెనిమిదవ బొమ్మ చెప్పిన కథ :- ఒక వైదేశికుడు విక్రమార్క క్షితీశునకు దా జూచిన యొకవింత జెప్పెను. ఉదయపర్వతమున బ్రవహించు గంగయను నదిలో నుండి స్వర్ణ స్తంభ మొకటి వెల్వడుచుండును. దాని యగ్రభాగమున నవరత్నఖచితమైన సింహాసన ముండును. ఆస్తంభ ముదయము సూర్యోదయమైనంతనే పైకిలేచి, మధ్యాహ్నమునకు సూర్యుని దాకి, సాయంత్రనమునకు మరల నాప్రవాహముననే మునుగుచూ ఇట్లను దినము జరుగుచుండును. ఇది విని రాజు వైదేశికునితో నటకేగి యొకరాత్రి యుండి, ప్రభాతమున బైకి లేచిన యాకనకస్తంభము నధిరోహించెను, అది సూర్య మండలము దరి జేరుచున్న కొలదియు విక్రమార్కుని శరీరము మాంస పిండమువలె నైనది. అట్లయినను నాతడు సూర్య ధ్యానమును విడువక చేయుచుండెను. అపుడు సూర్యుడాతని స్థైర్యమునకు సంతోషించి యమృతము గురిపించి యాతని శరీరమును యధాపూర్వముగ నొనర్చి, వరము గోరు కొమ్మనెను. విక్రమార్కుడు వలదన్నను సంతుష్టుడైన సూర్యుడు తన రత్నకుండలముల నిచ్చి యవి యనుదినమును నొక్కబారువు సువర్ణము నిచ్చునని చెప్పెను. అవి గ్రహించి సాయంతనమునకు విక్రమార్కుడు స్వర్ణ స్తంభము దిగి యుజ్జయినికి బయలుదేరెను. దారిలో నొకబ్రాహ్మణుడు దరిద్రుడైన తన ననుగ్రహింపుమని రాజునర్థింప రాజు కుండలముల నిచ్చి దాని మహిమను దెల్పి తన దారి బోయెను.

జక్కన విక్రమార్క చరిత్రమున బై కథ కొన్ని మార్పులతో నున్నది. విక్రమార్కున కొక యోగీశ్వరుడీ కనకస్తంభ వృత్తాంతమును జెప్పెను. పడమటి కొండ సమీపమున కనకపురముండెను. అందున్న మార్తాండ దేవాలయమున పాపనాశమను తీర్థముండెను. ఈ తీర్థము నట్టనడుమ శాతకుంభమయోజ్జ్వలమైన స్తంభమొకటి వాసరారంభ వేళ సంభవ మగుచుండెను. ఇది స్తంభమునకు సంబంధించిన మార్పు. సంస్కృత కావ్యమున విక్రమార్కుని శరీరము సూర్యుని సమీపించిన కొలదియు మాంస పిండము వలె నైనట్లున్నది. జక్కన కావ్యమున విక్రమార్కుడు సూర్యుని ప్రతాపాలోకమున కేమాత్రమును మిసిమింతుడు గాలేదని మార్చెను. అది గాంచియే సూర్యుడు తుష్టుడై కుండలము లిచ్చి, యవి యను దినమును రెండు బారువుల స్వర్ణము నిచ్చునని చెప్పెను. సంస్కృతగ్రంథమున నొక్క బారువు స్వర్ణమే యిచ్చునని యున్నది.

12. పందొమ్మిదవ సాలభంజిక చెప్పిన కథ:- విక్రమార్కుడు పేరోలగమున నుండ నొక వేటగాడు వచ్చి 'యీఅరణ్యమున గాటుక కొండతో సమానమైన వరాహమొకటి తిరుగుచున్నది. అట్టి దాని నాప్రాంతములో నెవ్వరును జూచియుండలేదు. దానిని దేవరవారు జూచిన బాగుండు'నని విన్నవించెను. రాజు కుమారునితో బాటుగా నరణ్యమున కేగి, నదీతటమున నికుంజమున నిద్రించుచున్న సూకరము గాంచెను. కోలాహలము విని యది ఘర్ఘురధ్వానము జేయ రాకుమారుడును, తదితరులును సర్వాయుధముల దానిపై బ్రయోగించి తమ కౌశలమును బ్రదర్శించిరి, కాని యది వారి నెవ్వరిని లక్ష్యపెట్టక, పారిపోయి పర్వత బిలమున బ్రవేశించెను. రాజును దాని పిఱుందన మహాంధకారమున బయనించి చివర

కత్యంత ప్రకాశము గల్గిన దియు, సువర్ణ ప్రాకారముతో, దేవతాయతనములతో సర్వాలంకార శోభితమైనదియునగు నొక నగరమున ప్రవేశించెను. విపణి మధ్యమున బోగా, కైలాసశిఖర సహోదరమైన రాజభవనమున బలిచక్రవర్తి సభ దీరి యుండెను. విక్రమార్కుడు సభలో బ్రవేశించి, బలిచే సమాలింగితుడై యాసన మలంకరించెను. తరువాత బలి ప్రశ్నపై తానెవ్వరో యెటనుండి యెట్లు వచ్చెనో చెప్పెను. అది విని బలి తన మనోరథము సఫలమైన దనెను. ఆతని సందర్శనమునకే వరాహము పిరుందున వచ్చితినని విక్రమార్కుడనెను. బలి విక్రమార్కునకు రసరసాయనముల నిచ్చెను. వాని గైకొని విక్రమార్కుడు రాజ్యమునకు వచ్చుచుండ మార్గమధ్యమున నొక బ్రాహ్మణుడు పుత్ర సమేతముగా నెదురై దరిద్రుడగు తన ఒకనాటి భోజన మైనను ననుగ్రహింపుమని రాజు నర్థించెను. రాజు తన యొద్ద నున్న వస్తువుల జూపి రసము సమస్త ధాతువులను స్వర్ణముగ మార్చునని, రసాయన సేవనమున జరా మరణము లుండవని జెప్పి, యేది గావలె నని యడిగెను, రసాయనము పుచ్చుకొని జరామరణవర్జితుడనైనను భిక్షాటనము తప్పదు గనుక పుత్రుడు రసమును, బ్రాహ్మణుడు రసాయనమును గోరుకొనిరి. వారికి కలహము సంభవించుటచే విక్రమార్కుడా రెంటిని వారికిచ్చి వెడలి పోయెను.

జక్కన విక్రమార్క చరిత్రమున నొకచెంచు రేడు విక్రమార్కుని కడకు వచ్చి, సూకర మొకటి తమ పరిసర ప్రాంతములందలి జనులను, పంటలను, నాశము చేయుచున్నదనియు, రాజు దానిని వేటాడ రా వలెననియు వేడుకొనెను. విక్రమార్కుడు వేటకేగి యాపందిని దరుముచు బాతాళ బిలమున బ్రవేశించెను కొంత దూరమేగి పంది మాయము కాగా విక్రమార్కుడాశ్చర్యపడుచు నచటి వీధులలో తిరుగాడుచుండెను. ఒక పరిచారకుడు వచ్చి యాతని బలిచక్రవర్తి కడకు దోడ్కొని పోయెను. బలి తన యనుచరుని పంది రూపమున బంపినది తానే యనియు, నతనిని జూడవలెనన్న యాశతో నట్లు చేసితి ననియు విక్రమార్కునితో జెప్పెను. విక్రమార్కుడు సంతోషించి బలితో రాజ్యాంగాది విషయములు ముచ్చటించెను. బలి కానుక పెట్టిన రసరసాయనముల మార్గమధ్యమున దన్నర్థించిన వృద్ధ బ్రాహ్మణునకిచ్చెను.

సంస్కృత గ్రంథమున విక్రమార్కుడు పుత్రసమేత ముగ వేటకేగి నట్లుండ, తెలుగు కావ్యమున పుత్రుని ప్రసక్తిలేదు. సంస్కృతమున విక్రమార్కుడు తానున్నది యెవరి సమక్షముననో గ్రహింపగనే యాతని దర్శించుటకే వచ్చితిననును. పంది యెచ్చటదో యెరుగని వాడట్లు మాటలాడుట సమంజసముగాదు. అందువలన జక్కన బలియే విక్రముని జూచుటకై తనయను చరుని కిట్టి రూపమున భూలోకమునకు బంపితినని కల్పించెను. ఇది యుచితమైన కల్పనము.

ఈ విధముగ సంస్కృత విక్రమార్క చరిత్రము నందలి కొన్ని కథలతో జక్కన విక్రమార్క చరిత్ర మందలి కొన్ని కథలు దాదాపుగ పూర్తిగ బోలి యుంట, జక్కన విక్రమార్క చరిత్రము సంస్కృత కావ్యమున కనువాదమని భ్రమించుట కాస్కారమున్నది.

ఇట్టి సందేహము గల్గుటకు గ్రంథస్థమైన సాక్ష్యమొకటి యున్నది. చూడుడు : విక్రమార్కుని గుణాదులు బొగడిన సిద్ధన మంత్రి జక్కనతో "దచ్చరితంబు ప్రబంధ శయ్యంగా దెలుగున జెప్పి - (1-28)"యనెను. దీని బట్టియు కృతిపతి సంస్కృత గ్రంథము ననువదింపు మన్నట్లు దోచును. కాని యిది సమంజసమైన యూహగాదు, బృహత్కథా మంజరి, కథాసరిత్సాగరము, సంస్కృత విక్రమార్క చరిత్రములు జక్కన ప్రబంధమందలి కథలకు మాత్రమే మూలములుగాని, జక్కన రచన కెంత మాత్రమును మూలములుగావనవచ్చును. ఏలన, జక్కన యనంతరకాలమున కొరవి గోపరాజనుకవి సంస్కృత విక్రమార్క చరిత్రము ననువదించెను. అది యనువాదమని తానే చెప్పుకొనినాడు. ఇది పండితలోకమునకు దెల్లమైన విషయము. కావున నాయా సంస్కృత గ్రంథములలోని కథలను మాత్రము గ్రహించిన జక్కన స్వతంత్ర గ్రంథముగ, సర్వాంగసుందరముగ, నష్టాదశ వర్ణనములతో, నవరస భరితముగ విక్రమార్క చరిత్రమును వెలయించెననుటలో నేమాత్రమును సంశయములేదు.

# విక్రాల శార్దూలము

శ్రీమతి వై. వత్సల, బి.ఓ.యల్

విక్రాల రంగకవి "శార్దూల శతకము" ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం-పరిశోధనాలయంలోని కాగితపు సమగ్రవ్రాత ప్రతి. ఇందు 21. పేజీలున్నాయి. ఈ ప్రతి 27 సెం.మీ పొడవు, 24 సెం.మీ వెడల్పు కలిగి పేజీకి 20 పంక్తులుగా వ్రాయబడింది. లిపి స్పష్టము. వ్రాయసగాడు తన పేరుగాని, వ్రాసిన సంవత్సరముగాని ఇందు వ్రాసు కొనలేదు. ఈ శతకంలో సరిగా నూరు పద్యాలే వున్నాయి.

తెలుగు సాహిత్యంలో శతక వాఙ్మయం ఒక విశిష్ట ప్రక్రియ. శతకాల్లో ముఖ్యంగా సంఖ్యామకుట ఛందోరస, నియమాదులు పాటించడం మామూలు. ఇవి ప్రధానంగా భక్తి, వేదాంత, నీతి, హాస్య, శృంగార, చారిత్రాత్మక, కథాత్మక ప్రకరణ, వివిధ వస్తుకాలు గానే కాక, అధిక్షేపకాలుగా కూడా రూపొంది వున్నాయి. మందలింపు, పరిహాసం, ఎత్తిపొడుపు, విమర్శ ఎగతాళి, శిక్ష మొదలైన వన్నీ ఈ అధిక్షేప రూపాలే. ఆలోచనలోను, సమస్యా పరిష్కారంలోను విభిన్న ధోరణులు ఈ అధిక్షేపాల్లో మనకు కనిపిస్తాయి. వ్యక్తి దూషణ ప్రధానంగా నున్నవి ఈ కోవకు చెందినవే. కవులు ఈ ప్రక్రియ ద్వారా తమ బాధ్యతలను, బాధలను బహిర్గతం చేసుకున్నారు. తిమ్మకవి, అడిదము సూరకవుల్లాంటి వారు పరోక్షంగా తమ కపకారం చేసిన వారి దుర్వర్తనల్ని, సమకాలిక పరిస్థితుల్ని పేర్కొంటే, లక్షణకవి, జగ్గకవుల్లాంటివారు. ఇతరుల దురంతాల్ని శ్లేష చమత్కృతుల్లో ప్రకటించారు. భీమకవి శాపానుగ్రహాలు సర్వలోక విదితమే. కొందరు నిశితంగా విమర్శించి వ్యక్తి దూషణ కావించారు. కాని విక్రాల రంగావారి అందరికీ భిన్నంగా ప్రత్యక్ష మౌతాడు. ఈ కవి తన కపకారం చేసిన వ్యక్తి మరణించాలని శపించి వివిధ దైవాలను ప్రార్థిస్తాడు. అంటే దూషణలో సరాకాష్ఠమాపడమే కాక, తన పాండిత్యాన్ని దుర్వినియోగం చేసుకోడాని క్కూడా పాల్పడ్డాడు.

ఈ కవి తన మాన్యాపహరుడైన రాజగోపాలుని శార్దూల హతుని గావించ గోరుతూ తన శతకాన్ని శార్దూల వృత్తాలలో రచించాడు. అంతేకాదు ప్రతి పద్యంలోని మొదటి పాదంలోను ఆరవ అక్షరం "త" కారం గావించాడు. ఈ "త"కారాన్ని కూడా ప్రయత్న పూర్వకంగా కాక, సహజ కవితా ధోరణిలో ఆస్థానాన్ని ఆక్రమింప జేయడం, ఆ కవి పాండిత్య ప్రతిభల్ని కవితా శిల్పాన్ని చాటుతుంది. ఈ నియమం శత్రువు కపకారం చేస్తుందని లాక్షణికుల నమ్మిక. ఆ నమ్మకం తోనే కవి ఈ ప్రయోగం కావించి సఫలుడయ్యాడు. సకల దేవతలను, అష్టదిక్పాలకులను, గాయత్రీ మంత్రాదులను కూడా శార్దూల రూపం దాల్చి తన విరోధిని చంపమని, ఒక్కొక్కరిని ఒక్కొక్క పద్యంలో ప్రార్థించాడు. ఇంకో విశేష మేమిటంటే ఈ శతక మకుటమైన "శార్దూల పదం పద్యాంతంలో గాకుండా, పద్యంలో ఏదో ఒక చోట ప్రయోగింపబడింది. కాకతాళీయమో

శాపఫలమోగాని కవి శపించిన ప్లైరాజ గోపాలుడు కొన్నాళ్ళకే వేటకు పోయి హతుడైనట్లు ప్రతీతి. బహుశః శార్దూల హతుడే అయివుండవచ్చు.

విక్రాల రంగాచారి ఒక అగ్రహారీకుడు. పూర్వుల అగ్రహారం మీద వచ్చే ఆదాయంతో సుఖంగా జీవించేవాడు. వెంకటగిరి సంస్థానాధీశుడు శ్రీరాజగోపాల యాచేంద్రదు మాంసాజ్యాదుల వల్ల కొవ్వి, దురహంకారియై కవి మాన్యాన్ని హరించి నిరాధారుణ్ణి చేశాడు. సకాలంలో శిస్తు చెల్లించనందు వల్ల రాజ్యాధికారులు సాగుబడికి అడ్డుతగిలి, శిస్తుకు వత్తిడి చేశారు. కవి జరిగిన అన్యాయాన్ని, శిస్తు కట్టలేక పోయిన కారణాన్ని రాజుకు విన్నవించుకున్నా నిష్ప్రయోజనమైంది. రాజు సత్యవ్రతుడని నమ్మి చూడడానికిచ్చిన దస్తావేజులు చేజిక్కించుకొని, తన భూములు లాక్కొన్నాడని వాపోయాడు. న్యాయస్థానంలో కూడా రాజు తన అధికార దుర్వినియోగంతో కూట సాక్ష్యాలతో తన అర్జీని తోసి పుచ్చాడని కవి స్వయంగా శతకంలో వివరించాడు. దివానాదుల కుటిలనీతితో తన మాన్యాన్ని హరించడం రాజుకు తగదన్నాడు. రాజులు భోగలాలసులైతే అధికారాన్ని దుర్వినియోగం చేయడం మామూలే.

విప్రమాన్యాపహరణ, నిరంకుశపాలన, తండ్రికే అన్నానికి ద్రవ్యమీయక పోవడం, సోదరులకు భాగం పంచక పోవడం, సోదరులు బాటసారులకోసం కట్టించిన చలిపందిళ్లు నాశనం చేయడం మొదలైన దుష్కృత్యాలవల్ల రాజగోపాలుని నీచస్వభావం వెల్లడౌతుందన్నాడు. విప్రవృత్తుల కంత రాయం కలిగించగా శుభకార్యాలు నిలిచిపోగా వారు దుర్భర జీవితం గడుపుతున్నారన్నాడు. దొంగలు కొంతైనా మిగులుస్తారు కాని రాజులు సర్వస్వం ఊడ్చేయగలరని – రాజుల దుష్టచిత్తాన్ని కవి నిశితంగా విమర్శించాడు. అతడు రాజవడం వల్ల యితరు లతన్ని ఏవిధంగాను శిక్షింపలేరన్నాడు. శుంఠ, లోభి, ఖలుడు, పతితుడు, దుస్స, వాచాలుడు, కీశప్రాయుడు, బక సజాతుడు, కుంక, కిరాతుడు – అంటూ నోటికి వచ్చినట్లల్లా రాజును తిట్టడంలో తన కడుపు మంటను వెళ్ళగక్కాడు. ఇలా దూషించి నందుకు తన నేమి అనవలదని భగవంతుని విన్నవించుకొంటూ తన అసమర్ధతను తెలుపుకున్నాడు.

"చేనిండం ఘృతంబు కమ్మని దధిక్షీరంబులం ద్రాగు" – (64) తన భార్యాబిడ్డలు క్షుధార్తిని తల్లడిల్లుట ఎట్లు సహింతునని వాపోవుచు, క్రోధావేశంతో ఆరాజును "కోదండాంబక తూణ కుంతములు మాకున్ లేవు కొట్లాడగా" – (76), "శిక్షచేయుటకు నాకే శక్తియుం లేమిచేనే శాపించితి" – (37), "ఏనీదేవతతిన్ భజించుటయె కా కిం కేమి యుపాయంబులన్ కానం, గావున నాకు సాధనమిదే" – (59), నంటూ కవి, శపించు వాక్శక్తి తప్ప వేరు శక్తిలేని బీద బ్రాహ్మణుడ నంటూ తన కృత్యాన్ని సమర్థించుకొన్నాడు.

ఇది శాపరూపమైన శతకం కాబట్టి మొట్టమొదట వినాయకుణ్ణి వదలి కాలుణ్ణి, తర్వాత ముక్కంటిని, ఇలా వరుసగా సకల దేవతలను, అష్టదిక్పాలకులను, సంధ్యను, గాయత్ర్యాది మంత్రాలను, వ్యాసుని, గంగాది నదులను, భేతాళుని, సీతారామలక్ష్మణ ఆంజనేయాదులను, పర్జన్యుని, కోదండాన్ని, ఇంద్రాణి మొదలైన సమస్త శక్తులను, సకల దేవతలను, శార్దూల

రూపంతో రాజగోపాలుని చంపమని, ఒక్కొక్కరిని ఒక్కొక్క పద్యంలో ఈ కవి కోరడం చూస్తే, ఆతని బాధా తీవ్రత స్పష్టమౌతుంది. అంతేకాదు, దశావతారాలలో హిరణ్యకశిపుని నరసింహుడు, హైహయులను పరశురాముడు, రావణుని రాముడు, కంసుని కృష్ణుడు, బలిని వామనుడు, చంపినట్లే ఈ రాజగోపాలుని విష్ణుమూర్తి చంపాలని కోరాడు. సీతారాముల ఆజ్ఞగా భావించి ఆంజనేయు లారాజును హతమొనరించాలని వేడుకొన్నాడు. వేదశాస్త్ర ధర్మ సత్యాదులు నిజమైతే, సూర్యచంద్ర నక్షత్రాదుల గతులు సత్యమైతే, కల్క్యవతారంలో దుష్టశిక్షణే ధర్మమైతే, చిన్ననాటి నుండి తాను వరదరాజును సేవించడం నిజమైతే, తన కవిత ప్రాజ్ఞాభిషిక్తమైతే, రాజగోపాలుడు అడవిలో శార్దూల హతుడౌనన్నాడు. తనలో తప్పులున్నా, దైవమంత్రాల్లో, ముక్కోటి దేవతల్లో నిజమైన మహిమ వుంటే, తన ప్రార్థనను త్రోసి పుచ్చక రాజగోపాలుని మేకను వలె పట్టి శార్దూలమై చంపమన్నాడు.

"శా ॥ ఈ శార్దూల శతంబు దేవమయ మయ్యేన్ గాన దుర్వారమై
శ్రీశానాన మహాజ్ఞచేత నపశీలిన్ రాజగోపాలునిన్
నాశం బొందగ జేసి సర్వ సుజనానందంబు గావించిస
ర్వాశా పూరిత కీర్తి గాంచుతను దైవానుగ్రహాప్తిన్ భువిన్ (100)

అని శతకాన్ని ముగించాడు.

భూదేవిని తల్లిలా నిరంతరం సేవించే తన్ను నెట్టి బలవంతంగా యీడ్చుకొని పోయినపుడు ఆమె ఎంత ఆర్తి జెందిందో అని వాపోయాడు. తన్నింతంతనరాని కష్టాల పాల్జేసిన ఆరాజును పంచభూతాలు వర్ణించేటట్లు, క్రూరులు భయపడేటట్లు, "కూయం గూయగలట్లు" చంపమని కోరడంలో ఆకవి మానసిక వ్యధ వెల్లడౌతుంది. ఆ రాజగోపాలుని వలె ఇతరరాజులు కూడ బ్రాహ్మణాగ్రహారాలు హరిస్తే విప్రులు తిండికే గతిలేక హవ్యాదులు సమర్పించలేరని వాపోయాడు. అందుకే "ధర ఇతర బ్రాహ్మణులు హాయెుందగా" - "భూదేవాళి రక్షకై (99)," వెంటనే రాజగోపాలుడు హతుడు కావాలన్నాడు. "పాహి పాహి" అనిన గజేంద్రుని రక్షించడానికి విష్ణుమూర్తి ఆమకరిని చంపినట్లే తన్ను రక్షించేందుకు ఆ రాజును చంపక తప్పదన్నాడు. నిత్యం ఆకాశయానం చేస్తూ ఆరాజు తనకు చేసిన అన్యాయాలు చూస్తున్న రవి శార్దూల రూపంలో అతనిని చంపక తీరదని మొరపెట్టుకున్నాడు. అట్లే రాజశ్రీని కూడ "భూక్షేమ కార్యార్థం" ఆపాతకుని శీఘ్రంగా వదలి పొమ్మని వేడుకొన్నాడు.

"రాజగోపాలుని తోడ నృల్యుల్వేంద్రుడు, ద్విజేంద్ర భూస్థితుల నూడందీయ యోచించి వారున్నా"(61) - రని, తన మాన్యాప హరణంలో దివాను ప్రముఖుడు, కావున, మొదట నారాయణ స్వామిని, తరువాత రాజును హత మార్చడం న్యాయంగా భావించాడు. ఆ దుష్టచతుష్టయంలో వారిలో వారికి "బాహాబాహి కల్గ జేసి వెనుకన్ భంజింపు శార్దూలమై (65)" - అని కోరడం అతని మనస్థితిని తెలుపుతోంది. అదీ ఆరాజును ఒక్కసారిగా చంపక

క్రమంగా రాజ్యభ్రష్టుని, నిర్ధనుని, వ్యాజ్యగ్రస్తుని చివరకు వ్యాధ్యాత్మునిగా జేసి మరీ చంపమనడంలో అతని బాధా తీవ్రత గోచరిస్తుంది. అంతతో చాలక "కాకులు, గద్దలు చీల్చి మెక్కునటులన్" మరీ చంపాలన్నాడు. తాను పడే పాట్లు చూచి అనీచుని చంపి తనకు భాగ్యమొసగాలని, తన శాపం, శార్దూలమై లోకలో కొట్టి మరీ చంపాలని ప్రార్థించడం చూస్తే అతని కడుపుమంట కళ్లెదుట ప్రత్యక్షమౌతుంది. తన కోరిక సఫలం చేయడానికి రమానాథుడు డాకేల శార్దూలంబుగా రాజగోపాలుని (98) తప్పక విదళించునని నమ్మకంగా శతకాంతంలో పలికాడు.

వాల్మీకి అనాలోచితంగా శాపరూపమైన ఒక శ్లోకాన్ని పలికితే, ఈ కవి తన కడుపు మంటను వెళ్లగక్కుతూ తనకు జరిగిన అన్యాయానికి వాపోతూ ఒక శతకాన్నే శాపంగా వ్రాసి ఒక ప్రత్యేక స్థానాన్ని అలంకరించాడు. ఈ శతకంలోని శైలిగాఢరచనా సంవిధానంగాని, పదగుంభనంగాని, సమాస ప్రయోగంగాని అనన్యమైన వనడంలో సందేహంలేదు. ఇతడు కవితా ప్రగల్భుడు, ఉభయ భాషాప్రవీణుడు. దుష్కరప్రాస సుదీర్ఘ సమాసాలతో సరసకవితా రచనా సమర్థుడు - అని "విక్రాలాన్వయ తోయరాశి శశియై (25)", "అక్షాహీశ్వర తార్క్ష్యరాజ హనుమంతా (31)", "విప్రగాను గతోషరాత్త ధన (84)" ఈ పద్యాలు చాల గలవు. దేశీయ, గ్రామ్య పదాలను సహితం ఇలాంటి రచనలో వాడిన నేర్పరి. కాని కవి ఇంతటి కవితా సామర్థ్యాన్ని ఇలాంటి శాపరచనకు దురుపయోగం కావించడం విచారణీయం. ఇదే ఒక సత్కావ్యమైతే కవి చిరస్మరణీయుడై శాశ్వతకీర్తి నార్జించేవాడు.

వామౌచిత్య విషయంలోనూ దీని విశిష్టత గమనార్హం. ఈ శతకంలోని వృత్తాలన్నీ శార్దూల వృత్తాలే పైగా క్రూరత్వానికి ప్రతీకమైన శార్దూల రూపం ధరించి మరీ రాజును హతమొనరించమని శార్దూల వృత్తాల ద్వారా కోరడం రెండోది. దీని మకుటం "శార్దూల" పదమే, "విప్రశార్దూల" అన్నట్లు విక్రాల రంగాచారి తన వేదనలో నిజంగా "విప్రశార్దూల" రూపం దాల్చి ఈ శాప రచన గావించడం మరొక విశేషం. ఇందలి ప్రతీపద్యం శార్దూల సమమైన క్రూరత్వాని ప్రకటిస్తోందనడం నిర్వివాదాంశం. కాబట్టి అన్ని విధాల ఈ శతకాని కీపేరు అతికినట్లుందనడం. అతిశయోక్తి కానేరదు.

# ఋగ్వేదములోని హితోపదేశ సూక్తములు

సాహిత్య విద్యాప్రవీణ

కలగ వేకంట రామశాస్త్రి, M.A. P.O.L.,

ఋగ్వేదమంత్ర భాగమే ఋక్సంహిత యనఁబడుచున్నది. వాగ్దేవి కుపాయనముగా ఋషులు తొలుదొల్త సంతరించి సమర్పించిన దివ్య వాగ్రత్న పేటిక ఋగ్వేదసంహిత. ఋక్సంహితలోని వివిధ వస్తు విషయాది వర్ణనలు అరుణోదయ కాంతి పుంజముల వలె లోకోత్తరజ్ఞాన దాయకములై, రమణీయార్థప్రతిపాదక శబ్దకావ్యముగా రూపుదిద్దుకున్నవి.

దీనిని గుర్తించియే మహోపాధ్యాయ, అభినవ వాగనుశాసన, స్వర్గీయ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు ఋక్సంహితా ప్రాశస్త్యమును తెలియఁ జేయుచు "శిక్షకు శిక్ష వ్యాకరణంబునకాకరము, ఛందస్సునకు మూలకందము, నిరుక్తంబునకుఁ బ్రవక్త, జ్యోతిషంబునకు జ్యోతి, కల్పమున కాకల్పము, మీమాంస లకు మేర, న్యాయంబున కాయువు, పురాణేతిహాసములపుట్టినిల్లు, ధర్మశాస్త్రముల తల్లి, వివిధార్యభాషలవిత్తన"[1] మని బహుధా వివరించిరి.

ధర్మ శాస్త్రముల తల్లియగు "ఋగ్వేదము"లోని హితోపదేశ సూక్తములను రేఖామాత్రముగా వివరించుటయే యీ వ్యాస ముఖ్యోద్దేశము.

హితోపదేశ – సూక్తపదవ్యుత్పత్తులను బరిశీలించిన యెడల "హితానాముపదేశః = హితోపదేశః" హితమును జేకూర్చు నుపదేశమనియర్థము. సూక్తం = సుష్ఠు ఉక్తమ్. మంచిమాటయని, యదివేదోక్త పరమైన స్తోత్ర మంత్రాదుల పరమయినదని తెలియుచున్నది.

ఋగ్వేదారంభ కాలమునందార్యులలో జాతి భేదము లేకపోయినను, అందఱునన్ని వృత్తులు సామాన్యముగా నాచరించుచున్నను, కాలక్రమమునఁ గొందఱు కొన్ని కొన్ని వృత్తుల యందు స్థిరపడినట్లాయావర్తన వలన గోచరించుచున్నది. అందు యజన యాజన మంత్రదర్శన మంత్రపఠన పాఠాదులు నియతముగా నాచరించు వారు పురోహిత వర్గముగాను, సంఘపాలన దేశ రక్షణ శత్రుహింసన జైత్రయాత్రాదులాచరించువారు నాయకవర్గముగాను, కృషి గోరక్షణ వాణిజ్యాదులాచరించువారు కృషీవలవర్గముగాను, పురోహితాదులకు ధర్మాచరణమునందును, నాయకులకు యుద్ధకార్య నిర్వహణమునందును, పరిచర్యలొనర్చుచుఁ బరిచారకులుగాను, భటులుగాను నుండువారు దాసవర్గముగాను నేర్పడి పరస్పర మైకమత్యమున దేశహితములు, సంఘ హితములునగు తమ తమ కృత్యములు నిర్వహించుచు వచ్చిరి. అట్లా యావృత్తుల

---

1. సంస్కృత వాఙ్మయ చరిత్ర, ప్రథమ సంపుటము, వైదిక వాఙ్మయము; పుట 117.

యందు స్థిరపడినవారే కాలక్రమమున బ్రాహ్మణ -క్షత్రియ - వైశ్య - శూద్ర జాతులుగా విడిపడిరి.

## 1. గార్హస్థ్యము.

అతిథి పూజ, యజ్ఞరూపమైన దేవతారాధనము, సంతాన ప్రాప్తి గృహస్థాశ్రమ ప్రయోజనములుగాఁ జెప్పబడినవి. పతి పత్నులు కలసియే యజ్ఞము చేయుదురు.

యా దంపతీ సమనసా సునుత ఆ చ ధావతః, దేవాసో నిత్యయా శిరా ॥[2]

ఓ దేవతలారా! పతిపత్నులు సమానమైన మనస్సుగలవారై నిరంతరము మీకు సోమరసము నర్పింతురు. దంపతులిద్దరు కలసి యేకవ్యక్తిగా నుండవలయునన్నంత విశిష్టమైనది వైదిక దాంపత్యము.

ఉత ఘా నేమో అస్తుతః పుమాన్ (ఋ. 5-61-8)

## 2. పతివ్రత.

పతివ్రత పవిత్రురాలు. ఏతత్సందర్భోచితముగా

"అనవద్యా పతిజుష్టేవ నారీ" (ఋ 1-73-3),

దోషరహితయు పతి చేత సేవితయునగు స్త్రీవలె అగ్నియున్నాఁడు.

పత్ని గృహమునకు రాణి.
సమ్రాజ్ఞీ శ్వశురే భవ సమ్రాజ్ఞీ శ్వశ్ర్వాం భవ ।
ననాన్దరి సమ్రాజ్ఞీ భవ సమ్రాజ్ఞీ అధి దేవృషు ॥ (ఋ. 10-85-46)

అను ఋక్కులను దృష్టాంతములుగా గ్రహింపఁదగును.

## 3. పుణ్యాపాపకర్మఫలములు.

సత్కార్మానుష్ఠాన పరుడైన వానికి నీ లోకములోను, స్వర్గములోను నానందము కలుగును.

"మధు వాతా ఋతాయతే మధు క్షరన్తి సింధవః
మాధ్వీ ర్న స్సంత్వోషధీః మధు నక్తముతోషసో
మధు మత్పార్థివం రజః మధు ద్యౌరస్తు నః పితా ॥ [3]"

వైదిక కర్మానుష్ఠాన పరుఁడైన వానికి నీలోకములోను, స్వర్గములోను నానందము కల్గును. నదులు, ఓషధులు, రాత్రులు, ఉషస్సులు, భూమి, స్వర్గము అన్నియు మధుమయములై యుండును. పాపములకు దుష్ఫలము కలుగును.

---

2. ఋ. 8-31-5.  3. ఋ. 1-90-6,7.

"హాపాస స్సన్తో అస్రుతా అసత్యా ఇదం పదమజనతా గభీరం". (ఋ. 4-5-5)

మానసిక కాయికా సత్యమును పలుకువారై, పరమ నికృష్టమైన నరకమును సృజించుకొనుచున్నారు.

## 4. బహుముఖభక్తి

అర్వాచీన హిందూ పవిత్ర గ్రంథములలో గన్పట్టు వాత్సల్య భక్తిని (ఋ.9-85-11), సఖ్య భక్తిని (4-17-1), దేవీ భక్తిని (7-10-1), ఋగ్వేదము వివరించుచున్నది.

## 5. వాణిజ్యము.

క్రయవిక్రయములలో వెలను గూర్చి వచ్చిన వివాదమును వామదేవ మహర్షి యిట్లు తీర్చుచున్నాఁడు.

"ఒకఁడొక వస్తువును మఱియొకనికి విక్రయించి నిర్ణయించు కొన్న వెల పుచ్చుకొని, తరువాతఁ గొన్న వానివద్దకు వెళ్ళి దీనికిఁ దక్కువ వెల యిచ్చితివి. ఇంకను గొంత సొమ్ము రావలసి యున్నది. ఆలోటు పూర్తి చేయవలసినదని యడిగినచోఁగొన్న వాఁడాలోటు పూర్తి చేయనక్కఱలేదు. వస్తువు విక్రయించినపుడు వారేర్పఱచు కొన్న మూల్యమే యమ్మినవానికి వచ్చును గాని యంతకంటె నెక్కువ రాదు.అట్లుగాక 'దాని మూల్యము తరువాత విచారించి నిర్ణయించు కొంద'మని సమయము జరిగినచో నపుడు విక్రయించినవాఁడడిగిన వెల కొన్న వాఁడివ్వవలసి యుండును".[4]

ఈ ఋగ్భావమును బూర్వాచార్యులు శ్లోకములుగా రచించిరి. సాయణు లుదాహరించిన యా శ్లోకములివి.

"అల్పం యః పరిగృహ్ణాతి మూల్యం పణ్యేన భూయసా ।
సక్రేతారం పునర్గచ్ఛన్న విక్రీత స్త్వయం మయా॥
ఇతి బ్రువన్కామయతే పున ర్మూలస్య పూరణం ।
స విక్రేతా పున ర్మూల్యం భూయసా న ప్రపూరయేత్ ॥
హీనం న లభతే వస్నం యదా విక్రీతవాన్ పురా ।
యథా సమయమేవ స్యాత్తయోర్న పునరన్యథా ॥
అయం విక్రయ ఏవేతి సమయశ్చేత్కృతో భవేత్ ।
అథమూల్యార్థమేతత్స్యాద్విచార్యైవతు నిర్ణయః ॥
ఇత్యేవం సమయోఽకారి తదా మూల్యం ప్రపూర్యతే ।

---

4. భూయసా వస్నమచరత్ కనీయోఽవిక్రీతో అకానిషం పునర్యన్ ।
స భూయసా కనీయో నారిరేచీద్దీనా దక్షా వి దుహన్తి ప్ర వాణమ్ ।
క ఇమం దశభిర్మమేన్ద్రం క్రీణాతి ధేనుభిః ।
యదా వృత్రాణి జంఘనదథైనం మే పునర్దదత్ । (ఋ. 4-24-9,10)

ఇందు క్రయ విక్రయాదుల విషయము సుస్పష్టముగాఁ దెలుపఁబడినది. ఋగ్వేదము యజ్ఞ క్రియార్థమైన స్తుతి రూపమంత్ర రాశియని యాజ్ఞిక పక్షము చెప్పుచున్నను, పరిశీలించినచోఁ దరువాత వెలువడిన సకల శాస్త్రేతిహాస పురాణాదులకు బీజభూతములైన వాక్యములన్నియు నందుగోచరించును. వేదాంతములకు నాధారభూతములైన ఋక్కులు వెదికిన కొలఁదిని బయల్పడును.

దీర్ఘతమో మహర్షి సృష్టిపూర్వావస్థను, జీవేశ్వరులనుగూర్చి బాగుగా వివరించెను.[5] భువన పుత్రుఁడైన విశ్వకర్మయను ఋషి సృష్ట్యాదులను హృదయంగమముగా వివరించెను.[6] పరమేష్ఠియను ప్రజాపతి మహర్షి వియదాది భావములయిన సృష్టి – స్థితి – లయములకుఁ బరమేశ్వరుఁడే కర్తయని నిరూపించియున్నాఁడు.[7]

## 6. అన్న–ధనాదులు.

ధర్మాచరణవిషయములందన్నదాన మత్యుత్తమము. ఆఁకలి గొన్నవానికన్నము పెట్టనివాఁడు మృత్యుప్రాయుఁడు. అతని విహమందు బంధువు లాదరింపరు. పరమందు దేవత లాదరింపరు క్షుదార్తునకన్నదానముచేయువాఁడును, దరిద్రునకు ధనదానము చేయువాఁడును బుణ్యలోకము గాంతురు. అదిగాక ధనమొక్క చోట నిలుచునదికాదు. అది రథచక్రమువలెనే తిరిగి పోవుచుండును. కావున నది యున్నపుడే దానము చేసి ఫలముగాంచుట యుచితము అనురీతిని దానమెంతేని పొగడఁబడినది.[8]

నవమ మండలములోనున్న 'చతుర్ఋచ' సూక్తమాయాకర్మములను బట్టి సిద్ధించు ఫలముల వలన మనుజులందుఁ గల్గెడు సామ్యమగు చేతోవృత్తిని జక్కఁగా నీతిశాస్త్ర పంథన వర్ణించి యున్నది.

నానానం వా ఉ నో ధియో వి వ్రతాని జనానామ్ ।
తక్షా రిష్టం రుతం భిషగ్ బ్రహ్మా సున్వన్తమిచ్ఛతీన్ద్రాయేన్దో పరి స్రవ ॥

కారు రహం తతో భిషగుపలప్రక్షిణీ ననా ।
నానా ధియో వసూయవోఽనుగా ఇవ తస్థిమేన్ద్రాయేన్దో పరి స్రవ "[9]

అందేమరియొక సూక్తము ధర్మ సత్కర్మముల యావశ్యకతను నిరూపించుచున్నది.

పృణీయాదిన్నాధమానాయ తవ్యాన్ ।
ద్రాఘీయాంస మను పశ్యేత పన్థామ్ ।
ఓ హి వర్తన్తే రథ్యేవ చక్రాః

5. ఋ. 1-164-4, 20,38,39.
6. ఋ. 10-81-1,2,3,4,.
7. ఋ. 10-129.
8. ఋ. 10-117
9. ఋ. 9-112-1,3

న్యమన్యముపతిష్ఠన్తి రాయః ॥
కృషన్నిత్ఫాల ఆశితం కృణోతి
యన్నధ్వానమప వృఙ్క్తే చరిత్రైః ।
వదన్ బ్రహ్మా వదతో వనీయాన్ ।
పృణన్నాపి రపృణన్త మభి ష్యాత్ ॥ [10]

పదవమండలమునందే సుభాషితమునకున్న ప్రభావమును వర్ణించుచున్న సూక్త మేకాదశర్చము. అందలి నాల్గుమంత్రముల నుదాహరించుచున్నాను.

సక్తుమివ తితఉనా పునన్తో
యత్ర ధీరా మనసా వాచమక్రత ।
అత్రా సఖాయః సఖ్యాని జానతే
భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధి వాచి ॥
యస్తిత్యాజ సచివిదం సఖాయం
న తస్య వాచ్యపి భాగో అస్తి ।
యదీం శృణోత్యలకం శృణోతి
నహి ప్రవేద సుకృతస్య పన్థామ్ ॥
హృదా తష్టేషు మనసో జవేషు
యద్బ్రాహ్మణాః సంయజన్తే సఖాయః ।
అత్రాహ త్వం విజహు ర్వేద్యాభి
రోహ బ్రహ్మణో వి చరన్త్యుత్వే ॥

ఋచాం త్వః పోషమాస్తే పుపుష్వాన్
గాయత్రం త్వో గాయతి శక్వరీషు ।
బ్రహ్మా త్వో వదతి జాతవిద్యాం
యజ్ఞస్య మాత్రాం వి మిమీత ఉత్వః ॥ [11]

లౌకిక సంస్కృత గ్రంథములలో హెచ్చుగ వర్ణింపఁబడ్డ స్త్రీలయు ధనములయుఁ గౌటిల్యమును ఋగ్వేదీయ సూక్తములు కూడ హెచ్చుచోట్ల నిందా పూర్వకముగ ఁబేర్కొని యున్నవి. అందొక ఋషి(10-27-12) 'కియతో యోషా కేవల ధనాయ యావధూయతాం పురుషాణా మనురాగ పాత్రాణి భవన్తి' యనియు, మఱొకఁడు తన కిష్టములగు గోవులనుగూర్చి (6-28-6) "హేగావః, యూయం కృశమపి జనం పీవానం నిః శ్రీకమపి సుశ్రీకం విదధ్వే, అనియు, నింకొకడు (8-33-17) 'ఇంద్రః ఖలు తదబ్రవీత్, స్త్రియాశ్చైతః శాసితుమశక్యం తస్యాః ప్రజ్ఞాపేఽలఘీయసీ' అనియు, వేఱొకఁడు (10-95-15) 'న వై స్త్రైణాని సఖ్యాని సన్తి,

10. ఋ. 10-117-5,7

11. ఋ. 10-71-2,6,8,11.

తాః ఖలు సాలా వృకహృదయః అనియు నీరీతిని దోషముల నుద్ఘోషించి యున్నారు. కాని మఱొకఁడు (5-61-6)

'నాస్తికాత్ త్యాగవిముఖాచ్చ పురుషాత్ బహ్వ్యః స్త్రియః ప్రశస్యన్తే' అని యభిప్రాయ పడినాఁడు.

## 7. సత్యప్రియత్వము.

సామాసత్యోక్తిః పరిపాతు విశ్వతో
ద్యావా చ యత్ర తతనన్నహానిచ।
విశ్వమన్యన్ని విశతే యదేజతి
విశ్వాహాపో విశ్వాహోదేతి సూర్యః ॥ (ఋ. 10–37–2)

సత్యవచనము నన్ను సర్వవిధముల రక్షించుగాక యనెడి యానాటి విశ్వాసము వారి సత్యప్రియత్వమును వేనోళ్లఁజాటు చున్నది. ఋగ్వేదకాల మందలి ప్రజలు సత్య సంధులు, న్యాయబద్ధులుగా జీవయాత్ర యొనరించు చుండెడి వారనుటకు పైఁజేర్కొనబడిన ఋక్కు దృష్టాంతమగు చున్నది. ఈ విధముగా ఋగ్వేదములో నెల్లెడ నుదాహరణములు లభించును.

## 8. విద్యా వివేకపద్ధతి.

ఆంగిరసుఁడయిన బృహస్పతి మహర్షి రచియించిన విద్యాసూక్తమొకటి నాఁటి విద్యా వివేకపద్ధతి నెంతయు విశదీకరించుచున్నది. అందలి వాక్యము లొకటి రెండు.

"జల్లెడతోఁబిండి జల్లించునట్లుగా నెవరు శబ్దార్థములను మనస్సునఁబరిశోధించి సభలో సంభాషింతురో, అట్టి బుద్ధిమంతులగు విద్వాంసులు సమాన శాస్త్ర ప్రతిపత్తి కలవారై పరస్పరము సఖ్యమును బొందు చున్నారు. అట్టివారి వాక్కులందు శుభప్రదమైన విజ్ఞాన లక్ష్మి నివసించునని తెలియనగును.[12]

'ఎవఁడు మనస్సు చేఁబర్యాలోచన చేయుచునే మాటల భావము కని పెట్టఁడో, ఎవఁడు వినుచునే మాటలు విననట్లుండఁడో, అట్టివాఁడు తెలివి మాలినవాఁడు. బుద్ధిమంతుఁడగు విద్వాంసుఁడు అట్లుగాక, మంచి చీర కట్టుకొని శయన సమయమునఁ దనప్రక్కఁజేరిన యనురక్తురాలగు భార్యను భర్త సుస్పష్టముగాఁజూచి, మనోగత శృంగార హావ భావదులను కేవలము చూపుతో గ్రహించి యానందించునట్లే మాటలను జక్కఁగాఁ గనిపెట్టును, సరిగావినును, బాగుగాఁ దెలిసికొనును.

ఇట్లు వాగ్వి జ్ఞానమును బ్రశంసించునీ విద్యా సూక్తమంతయు వేదము చదివి వేదార్థ మెఱిఁగి సభలలో సంభాషింపఁదగిన వేత్తృత్వ మార్జింపఁదగునని బోధించుచు నతి మనోహరముగా

12. ఋ. 10-71. 'సక్తుమివ తితఉనా పునన్తో యత్రధీరా మనసా వాచమక్రత' ఇత్యాది.

నున్నది. ఇందలి వేదార్థానభిజ్ఞ నిందాపరమయిన కడపటి వాక్యము లిట్లున్నవి.

వేదజ్ఞులతో సంచరింపక దేవతల నారాధింపక యుండునట్టి విద్యావివేకశూన్యులు బ్రాహ్మణులు కారు, ఋత్విక్కులుగారు. కేవల లౌకిక వాక్కు నాశ్రయించిన యట్టివారు హాలికులై వ్యవసాయము చేసికొనుచుందురు.

## 9. మాంసభక్షణము.

ఇంద్రాణీంద్ర వృషాకపుల సంవాద సూక్తమందింద్రుని మాట లిట్లున్నవి.

'ఉక్ష్ణో హి మే పంచదశ సాకం పచంతి వింశతిం ఉతాహమద్మి
పీవ ఇదుభా కుక్షీ పృణంతి మే విశ్వస్మాదింద్ర ఉత్తరః ॥[13]

నా భార్యయైన యింద్రాణిచేఁ బ్రేరితులై యజ్వలు పదియేను వృషభములను, ఇరువది యెద్దులను వండుచున్నారు. నేను వానిని భక్షించుచున్నాను. తిని బలియుచున్నాను. పైగా యాగకర్తలు సోమరసముచే నాడొక్కలు నిండించుచున్నారు. అందుచే లోకమంతటి కంటె నేను గొప్పవాఁడనగుచున్నాను.

ఇట్లే వృషాకపి వసుక్ర భరద్వాజ సోమాహుతి దీర్ఘతమః ప్రభృతులగు ఋషుల వాక్యములను బట్టి యజ్ఞహవిస్సుగా మాంసమును భక్షించుట కలదని యీక్రింది విధముగాఁదెలియవచ్చుచున్నది.[14]

'అంగిరస్సులింద్రుని కొఱకు బలిసిన మేషమును వండిరి'. 'ఇంద్రుఁడు యజ్ఞపశువులైన వృషభములను భక్షించుఁగాక'.

'ఇంద్రా! నీ నిమిత్తము యజమానులు వృషభపశువులను వండుచున్నారు. వాని నారగింపుము'. 'అగ్నీ! ఋగ్రూపమయిన హవిస్సు ఋషభ వశామాంస రూపముగాఁ బరిణమించి నీభక్షణమునకగుఁగాక'.

వీనిని బట్టి యగ్నీంద్రాది దేవతలనుద్దేశించి హోమముచేయుమాంసరూప హవిస్సు వారు కూడ భక్షించెడి వారని విదితమగును. కాని, సురాపానము వలెనది ఋగ్వేదకాలమందు నిషేధింపఁబడక చాలా కాలమువఱకు నాచరణలో నున్నట్లుగా నితరగ్రంథములలోని యతిథి పూజా కల్పము వల్లఁ గూడ గోచరించును. ఆర్యులు బౌద్ధమతారంభకాలమున మాంసమును బూర్తిగా నిషేధించి రనుట నిజము.

## 10. జూదము

సప్తవ్యసనములలో నంతర్భూతమగు జూదమును గూర్చి తెలియ జేయునొకే యొక సూక్తము కలదు. ఇది దీన విలాపాది మిషచే జూదగానికిఁ జక్కని యుపదేశమును గావించును.

13. ఋ. 10-86-14.
14. ఋ. 10-27-17; 10-86-13; 10-28-3; 6-16-47; 1-161-10.

ఈ సూక్తమాధునిక నీతి గ్రంథములకాధారమగుట వలన నీతి కోవిదుల యందు గొప్పగా భావింపఁబడు చున్నది.

తానాడిన జూదము వలన నాత్మీయులకును దనకును సంభవించిన దుర్దశను గనులారఁ గాంచియు నొకానొక జూదరి వ్యసనమును మాన్పుకొనలేక పరితాపపడు రీతి యీక్రింది సూక్తమున గాన నగును.

నీచా వర్తంత ఉపరి స్ఫురంత్య హస్తాసో హస్తవంతం సహంతే ।
దివ్యా అంగారా ఇరిణే న్యుప్తాః శీతాః సంతో హృదయం నిర్దహంతి ॥
స్త్రియం దృష్ట్వాయ కితవం తతాపాఽన్యేషాం జాయాం సుకృతం చ యోనిమ్ ।
పూర్వాహ్ణే అశ్వాన్ యుయుజే హి బభ్రూన్త్సో అగ్నే రంతే వృషలః పపాద ॥
అక్షైర్మా దీవ్యః కృషిమిత్ కృషస్వ విత్తే రమస్వ బహుమన్యమానః ।
తత్ర గావః కితవ తత్ర జాయా తన్మే వి చష్టే సవితాయ మర్యః ॥ [15]

జూదమూడెడి పాచికలను 'విభీతక వృక్షపు' (తాండ్రచెట్టు) విత్తులతోఁజేయుదురు. పూర్వము నుండియు వచ్చుచున్న యీ యాటల సంప్రదాయమిప్పటికిని భారత దేశమున నెంతయు బ్రచారములో నున్నది. జూదమను నీ దుర్వ్యసనమునకు లోనై, సంఘమునందు బతితులై, దీనావస్థను బొందిన వారనేకులు నేటికిని మనకుఁ గాన్పింతురు.

## 11. సురాపానము.

ఋగ్వేదమునందు సురాపానము పట్ల నిరసనభావమే చూపఁబడినది. ఇందు రెండు ఋక్కుల భావ మిందుదాహరించెదను.

'ఇంద్రా! సుర త్రాగినవానికి మత్తెక్కించునట్లే నీవు త్రాగిన సోమములు నీకడుపులో గుడగుడ లాడుచు నీకు మత్తెక్కింపఁ బరస్పర సంఘర్షణముగావించు చున్నవి.[16] [హృత్సు పీతాసో యుధ్యంతే దుర్మదాసో నసురాయామ్ । ఊధర్న నగ్నా జరన్తే ॥]

ఇందు సురాపానము మదహేతువని మేధాతిథి పేర్కొనినాఁడు. వసిష్ఠ మహర్షి కూడ -

'ఓ వరుణా! సురారూపమును క్రోధరూపమును అక్ష (పాచికలు) రూపమునునైన దైవగతియే పురుషుని పాపవృత్తికి మూలమగు చున్నది[17]' అని యనర్థహేతువైన సురాపానమును దూషించినాఁడు.

---

15. ఋ. 10-34.
16. ఋ. 8-2-12.
17. న స స్వో దక్షో వరుణ ధ్రుతిః సా సురా మన్యు ర్విభీదకో అచిత్తిః ।
అస్తి జ్యాయాన్కనీయస ఉపారే స్వప్నశ్చ నేదనృతస్య ప్రయోతా ॥ (ఋ. 7-86-6)

## 12. సాంఘికరీతి.

సంఘ విద్రోహకరశక్తులు సహింపఁదగనివి.
'యో నః స్వో అరణో యశ్చ నిష్ట్యో జిఘాంసతి ।
దేవాస్తం సర్వే ధూర్వన్తు ॥ (ఋ. 6-75-19)

'మమ్ము హింసింపఁ గోరు శత్రువు లెవరైనను, మాలోని వారేయైనను వారిని దేవతలు నెట్టివేయుదురుగాక!'. ఋగ్వేదము సంఘసామరస్య భావమును ప్రతి బింబింపఁ జేయుచున్నది. మీకందరకు మంగళకరమైన కలయిక జరుగునట్లుగా మీసంకల్పము నేకవిధముగా నుండుగాక! మీ మనస్సు లేకమగు గాక! మీయంతః కరణము లేకముగుగాక!

సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః ।
సమాన మస్తు వో మనో యథా వః సుసహాసతి ॥ (ఋ. 10-196-4).

# శ్రీహర్షుని నైషధము - శాస్త్రార్థపరామర్శ

భాషాప్రవీణ

శ్రీ కందుకూరి రామకృష్ణ సూర్యనారాయణ, M.A. (Tel. & Skt)

సూరపండితులలో అగ్రగణ్యుడు శ్రీహర్షపండితుడు. ఇతడు సర్వతంత్ర స్వతంత్రుడు. కాశ్మీరదేశ ప్రభువు ఆస్థానములో నుండెను. నిర్గుణసమాధిలో నుండెడివాడు. అతని తర్కమునకు తిరుగులేదు. అతడు శంకరాద్వైత వేదాంతమునకు "ఖండన ఖాద్యము" అను ఉద్గ్రంథమును వ్రాసెను. దానికే "అనిర్వక్తవ్యతా వాదము" అని నామాంతరము. అట్టి శ్రీహర్షునికి బంగారమునకు వెలిగారపు అంటినట్లు కవితాధోరణి కుదిరినది. ఆ కవిత్వమును ఆధారముగా చేసికొని ఎల్లశాస్త్రముల అర్థములను కావ్యములో-కూర్చవలెనను సంకల్పము కల్గినది. ఆసంకల్ప ఫలితమే నైషధకావ్యము. "నిషధానాం ఇదం నైషధః" తస్యేదమిత్యణ్. ఇందు నలదమయంతుల ప్రథమ స్వయంవరము వర్ణింపబడినది. ఇది 22 సర్గల కావ్యము. ఇందు తర్క, వ్యాకరణ, మీమాంసా, సాంఖ్య, యోగ, వైద్యనాస్తిక శాస్త్రముల అర్థములు సందర్భములను బట్టి సమకూర్చబడినవి. దానివలన అతని ప్రజ్ఞా విశేషము పాఠకులకు వ్యక్తము కాగలదు. ఈ నైషధమునకు మల్లినాథుని "జీవాతువు", నారాయణ పండితుని "నైషధీయ ప్రకాశిక" అను రెండు వ్యాఖ్యలు గలవు. వారిరువురు ఉద్దండ పండితులు. మూలము యొక్క ప్రతిపదార్థమును, విశేషములను చూపుటలో ఆవ్యాఖ్యలు సమర్థమైనవి.

శ్రీహర్షుడు నైషధకావ్యము చివరనొక ప్రతిజ్ఞ చేసియుండెను. "గ్రంథ గ్రంథిరిహ క్వచిత్ క్వచిదపి" దీని భావమేమనగా సామాన్యముగా సంస్కృతములో ఏదేనొక శాస్త్రమునందు పరిశ్రమ చేసినవారు ఈ రీతిగా భావింతురు. "నేను బాగుగా చదివితిని నాకు తెలియనిది ఎక్కడ ఉండును? క్రొత్తదైనను నేను సమన్వయింపగలను".

ఇట్టి భావనచే గర్వితుడై నాగ్రంథమును తాకవద్దు సామాన్యపండితులకు అందుబాటున లేకుండా గురుముఖతః అధ్యయనము చేసినపుడే నా కావ్యములో ప్రవేశము కల్గును. నేను బుద్ధిపూర్వకముగానే అచ్చటచ్చట గ్రంథ గ్రంథుల నుంచితిని. అనగా శబ్దార్థములలో వక్రతను చూపించితిని. అవి సామాన్యముగా స్వంతముగా అన్వయించుటకు సాధ్యముకాదు. గురుపరంపరాముఖముగా అధ్యయనము చేసినవానికి సాధ్యమగును. అట్టివాడు సజ్జనుడు. అట్టివాడు తన కావ్యపఠనమునకు యోగ్యుడని భావము. ఈ రీతిగ గ్రంథగ్రంథులను చేర్చుట వలన తన కావ్యమునకు కావ్యత్వము చేకూరకపోవచ్చును. అందువలన "క్వచిత్ క్వచిదపి" అనినాడు. కావ్యమంతయు దుర్బోధమైన అది కావ్యమే కాకపోవలసి యుండును. కనుక నాకావ్యము ప్రసాదగుణ యుక్తము. పై రీతిని అక్కడక్కడ దురవగాహముకూడా. ఇట్టి

భావముతో ఈ కావ్యము నిర్మింపబడినది. వ్యాఖ్యాతలీ కావ్యము నందున్న గ్రంథగ్రంధులను చక్కగా విప్పి పాఠకులకు సుబోధముగా చేసిరి. ఆవ్యాఖ్యాతలు గూడ సర్వతంత్ర స్వతంత్రులు. కావుననే వ్యాఖ్యలు వ్రాయ గల్గిరి. ప్రస్తుతము ఆ వ్యాఖ్యల సాహాయ్యమున వ్యాకరణ శాస్త్ర రహస్యములను పాఠకులకందించు చున్నాము.

లోకులకీ విషయముల నందించుటకు కారణమేమనగా డా. శ్రీ జయ సీతారామశాస్త్రిగారు నైషధకావ్యములోనున్న శాస్త్ర రహస్యములను వెలిబుచ్చుచు "శ్రీహర్షనైషధం – దర్శనపరామర్శః" అను గవేషణ గ్రంథమును పి.హెచ్.డి. పట్టమునకై వ్రాసి ప్రకటించియుండిరి.≠ అచట శ్రీహర్షుని భావములను స్పష్టపరచలేకపోయిరి. వ్యాఖ్యాతలు చూపిన భావమును కూడ అందుకొనలేకపోయిరి. మీదు మిక్కిలి వ్యాఖ్యాతలకు అజ్ఞత నాపాదించిరి. అటువంటి విమర్శ గ్రంథములను చూచిన పిమ్మట అది సత్యమేమో అనిభావించుట లోక సహజము. దాని వలన మూలగ్రంథము, వ్యాఖ్యానముల యొక్క యాథార్థ్యము మఱుగునపడి అసత్కల్పనకే వ్యాప్తి చెందు నవకాశ మున్నది. అల్లగుట కావ్యకర్తకు, వ్యాఖ్యాతలకు అపకీర్తి కరము. అట్టి ప్రమాదములను తొలగించి నిజరూపము చూపించుటకే నాప్రయత్నము. అట్టి నిగూఢ గ్రంథార్థములు వృద్ధసేవ వలనగాని స్పష్టము కావని వ్యాఖ్యాతలు తమ వ్యాఖ్యల యందు నిర్ణయించిరి.

క్రియేత చేత్ సాధు విభక్తి చింతా
వ్యక్తి స్తదాసా ప్రథమాఽభి ధే యా ।
యా స్వౌజసాం సాధయితుం విలాసై
స్తావత్ క్ష మానామ పదం బహుస్యాత్ ॥ (నైష 3-23)

ఈ శ్లోకమునకు మల్లినాథుని వ్యాఖ్య ప్రకారము సాధు విభక్తి చింతా = సత్పురుషుల విభాగ విచారము అనగా ఎవరు సాధుజనులు? పరులయందు దయ, ప్రజల రక్షణ, ధర్మము నందు బుద్ధి, పాపభీతి, భుజబలముచే శత్రుస్థానములను స్వాధీనము చేసికొనుట, సమస్త లోకపరిపాలనా దక్షత మొదలగు సద్గుణములు గలవారు అనివిచారణ. క్రియేతచేత్ =చేయబడినట్లైతే; (అట్టిచింతకలవారిచే – కర్త) తదా = అపుడు సా, వ్యక్తిః = ఆనలవ్యక్తి ప్రథమాభి ధేయా ప్రథమం = ముందుగా, అభిధేయా = పరిగణింపతగినది. సత్పురుషుల కుండవలసిన గుణములన్నియు అందఱికంటె నలవ్యక్తియందు మెండుగా ఉండుటచే ఆనల మహారాజు అందఱికంటె అగ్రగణ్యుడై యున్నాడు. కనుక ఆతనిని ముందుగా చెప్పవలయును. ప్రథమాభిధేయా అనునది సమస్తపదము. ప్రథమం అభిధేయా అని విగ్రహము. క్రియేత అనునది కర్మప్రత్యయము, సంభావనాయాం లిఙ్.

ఎందువలననగా అట్టి విచారణ యందు ఆసక్తి గలవారు కర్తలు. దానికి కారణము ఏమనగా యా = ఏనలవ్యక్తిః స్వౌజసాం, స్వ = స్వీయమైన ఓజసాం = బలములయొక్క, విలాసైః =

≠ 1987. కిరణ్ హిందిప్రెస్., మోరిస్ పేట్, తెనాలి – 522202.

వ్యాప్తుల చేత తావత్ = ఆ రీతిగ, బహు = అధికముగు, అనామ = నమ్రతలేని అనగా వినయము లేని అని అర్థము గాదు. తనకంటె అధికులున్నపుడు వారివద్ద తాను శిరసువంచి యుండవలయును. ఇది నమ్రత అనుటకు అర్థము. అట్టినమ్రత లేదని అనగా సర్వాధిక బలము గలదని అర్థము. నమతి ఇతి నామ అనగా నమ్రత ఇతరులకు లొంగియుండుట నాస్తినామ యస్యతత్ = అనామ ఇతరులకు జయించుటకు సాధ్యముగాని, పదం = రాజ్యస్థానమును, సాధయితుం = స్వాయత్తముగా చేసికొనుటకు క్షమా = సమర్థమై సదో. ఇచట "ఓజసాం విలాసైః" అను బహువచన ప్రయోగము వలన అసంఖ్యాకములగు బలములు గలట్టియు, వాని ప్రసారములుకూడ అసంఖ్యాకములనియు వ్యక్తమగుచున్నది. కావుననే ఇట్టి రాజ్యస్థానములను నలుడు స్వాధీనము చేసికొనగలడు. ఇది ప్రస్తుత నలరాజువర్ణనా ప్రసంగార్థము.

ఈ ప్రసంగమున పాణినీయ వ్యాకరణ శాస్త్రార్థ ప్రసంగము శ్లిష్టపద ప్రయోగముచే వ్యక్త పరచి యున్నాడు. విభక్తి చింతా = సుప్విభక్తుల విచారణ, సాధు = లెస్సగా, క్రియేత చేత్ = చేయబడినట్లైతే తదా = అపుడు, ప్రథమా వ్యక్తిః = ప్రథమా విభక్తి (ఇచట వ్యక్తి శబ్దమునకు వ్యజ్యతే ప్రకృత్యర్థః అనయా" అను వ్యుత్పత్తిని బట్టి వ్యక్తి పదము విభక్తి పరముగా వచ్చును) అభిధేయా = పరిగణింప తగినది. యా = ఏ ప్రథమా విభక్తి స్వౌజసాం = సు, ఔ. జస్. వీని యొక్క, విలాసైః = ప్రసార ములచేత అనగా భిన్న భిన్న కార్యముల చేత, బహు = అనేకముగు, నామపదం = సుబంతపదమును, సాధయితుం = నిష్పాదించుటకు, క్షమా = సమర్థమై సదో.

ప్రథమావిభక్తిలో సు, ఔ, జస్ మూడు వచనములున్నవి. ఏకవచన ద్వివచన బహువచనములు కానీ ఈ మూడింటి వలన అసంఖ్యాకములగు సుబంతపదములు నిష్పన్నమగుచున్నవి. ఇచట మల్లినాథుని టీకలో నామపదం = సుబంతపదం అని యున్నది. ఇచట నామ పదమునకు ఘట, పట, మున్నగు ప్రాతిపదికములర్థము. అట్టి ప్రాతిపదికముల కంటె సుప్రత్యయములు వేరును. ఘట + సు, ఘట + ఔ, ఘట + జస్ ఇత్యాది. ఇట ఘట + సు అను సముదాయము సుబంత పదము. ఇచట నామశబ్దము ప్రాతిపదిక పరము నామ పదం, నామ = ప్రాతిపదికము ప్రకృతిగాగల, పదం = సుబంత పదమని అర్థము చెప్ప వలయును. కేవల ప్రాతిపదికము పదము కాదు. ఘట + సు, అవి "సుప్తి ఙంతం పదం" (అ.సూ - 1-4-14) అని పాణిని సూత్రము. ఇది వైయాకరణుల ఒక పద్ధతి.

నామ శబ్దమునకు సుబంతము అర్థమని కొందరు వైయాకరణులు చెప్పిరి. వారి మతమున నామ చ తత్ పదంచ - నామపదం; నామ = సుబంతమైన, పదం = పదమని కర్మధారయ సమాసము. నామ శబ్దము ప్రాతిపదికమను పక్షమున నామ ప్రకృతికం పదం నామపదం అని మధ్యమ పదలోపి సమాసము.

ఇచట అభిధా వ్యాపారము ప్రకృతమగు నలరూపార్థమును బోధించి విరమించినది. కనుక ఆ శబ్దము రెండవ అర్థమును చెప్పుటకు సమర్థము కాదు. లక్షణావ్యాపారము కూడ ఇచట ప్రసరింపదు. అనుపపత్తి ప్రతి సంధానము లేదు గదా అర్థాంతరము భాసించుచున్నది. అది

కేవలము వ్యంజనా వ్యాపారగమ్యమే. అందునను "ప్రథమా" "సౌజసాం" "విభక్తి" శబ్దముల వలన భాసించు చున్నది. మఱియొక శబ్దముల నుపయోగించిన ఈ రెండవ అర్థము రాదు. కావున ఇచట శబ్ద శక్తి మూలధ్వని అని మల్లినాథుని టీక, ఇచట ఒక అంశము గమనింప వలసి యున్నది. శబ్ద శక్తి ము లమున వ్యాకరణ శాస్త్రార్థ రూపమగు వ్యంగ్యార్థము భాసించినది. కానీ వాక్యమునకు ఒక దోషము ప్రసక్తమగుచున్నది. ప్రకృతము నలరాజవర్ణనము; ఏ సంబంధము లేకుండగనే వ్యాకరణ శాస్త్రార్థము భాసించుచున్నది. ఇది దోషము. కాగా "అసంబద్ధార్థాభిధాయిత్వ" దోషము వాక్యమునకు కలుగుచున్నది. కనుక ఆ దోషమును పరిహరించుటకై ప్రకృతార్థమునకు అప్రకృతార్థమునకు ఉపమానోపమేయ భావమను సామర్థ్యము వలన కల్పింపవలయును. కనుక ఇచట ఉపమా ధ్వని అంతట పర్యవసానమగుచున్నది. ఈ అంశము ధ్వన్యాలోకములో ద్వితీయోద్ద్యోతమున "ఆక్షిప్త ఏవా లంకారః" అను కారికా వ్యాఖ్యానమున ఆనందవర్ధనుడు స్పష్టపరచి యున్నాడు. మల్లి నాథ గ్రంధమునకు ఇంతవఱకు తాత్పర్యము చెప్పవలయును.

సారాంశమేమనగా నల పక్షమున "సాధు విభక్తి చింతా" అనునది సమస్త పదము; వ్యాకరణ పక్షమున "సాధు" అనునది క్రియా విశేషణము; "ప్రథమాభిధేయా" అనునది నలపక్షమున సమస్తపదము; వ్యాకరణ పక్షమున ప్రథమా, అభిధేయా అని వ్యస్తపదములు, నల పక్షమున స్వౌజసాం, అనునది స్వ, ఓజసాం అని షష్ఠీతత్పురుష సమాసము. వ్యాకరణ పక్షమున సు, ఔ, జస్ అని ఇతరేతర ద్వంద్వ సమాసము. నల పక్షమున సాధయితుంఅనునది స్వాధీనార్థకము. వ్యాకరణ పక్షమున "నిష్పాదయితుం" అని నిష్పత్త్యర్థకము; విలాసైః అనునది నలపక్షమున వ్యాప్త్యర్థకము; వ్యాకరణ పక్షమున ఒక చోట విసర్గ రామః, ఒక చోట ఈ కారము హరీ ఒకచోట ఆకారము మాతా ఒక చోట అం = జ్ఞానం ; వేరొక చోట శీ = మనసీ; ఇంకొక చోట శి = జ్ఞానాని మొ॥వి. ఈ రీతిగా భిన్న భిన్న ఆదేశరూపమైన విలాసములు. సు, ఔ, జస్ అనునవి మూడు వచనము లున్నను పై రీతిని భిన్న భిన్న వికారములచేత అనంత సుబంత పదములు నిష్పన్నములగుచున్నవి. నల పక్షమున "అనామ" పదమునునది సురపతి కైనను (మ్రొక్కని శత్రువుల స్థాన పరము. వ్యాకరణపక్షమున నామ ప్రకృతిక సుబంతము.

"సాధు విభక్తి చింతా" ప్రథమాభిధేయా" "స్వౌజసాం" 'విలాసైః" "నామపదం" ఈ పదములు పక్షద్వయ సాధారణముగ ఉండుటచే వాని నుపయోగించి శ్రీహర్ష పండితుడొక విచిత్రమైన వ్యాకరణ శాస్త్రార్థమర్యాదను చూపియున్నాడు.

నారాయణ పండితుడు వ్రాసిన "నైషధీయ ప్రకాశం" అను వ్యాఖ్యానము ననుసరించి పైశ్లోకమునకు సమన్వయము చూపబడుచున్నది.

సాధు విభక్తి చింతా = ఎవరు సాధువులని, విభాగ విచారణ, క్రియేత చేత్ = చేయబడినట్లైతే, తదా: తర్హి: సావ్యక్తిః = ఆనలవ్యక్తి, ప్రథమా = ఆద్యా = మొదటిగా అభిధేయా = వాచ్యా = చెప్పతగినది. సాధువుల మధ్యలో నలుడే మొదట లెక్కింప తగినవాడని భావము. ఏల ననగా యా = ఏనలవ్యక్తి, ఓస్వౌజసాం = స్వ = తనయొక్క ఓజసాం = బలముల యొక్క

విలాసైః = విభవములంచేత, బహు = అసంఖ్యాకమగు అనామపదం = ఎవరికీ తలవంచని అధిక బలశాలులగు శత్రువులస్థానమును, సాధయితుం= స్వాధీనము చేసికొనుటకు, క్షమా = సమర్థమైనది అని నలపక్షమున వ్యాఖ్యానము. "అనామ పదం" అను దానికి నారాయణుడు చూపిన అర్థము ఈ విధముగా సంపాదింపబడినది. నమ్ ప్రహ్వీభావే అను ధాతువు కంటె భావార్థమున ఘఞ్ ప్రత్యయము చేరగా, "అతఉపధాయాః" (అ.సూ 7-2-116) ఉపధావృద్ధి రాగా "నామ" అని అకారాంత పులింగ శబ్దము నిష్పన్నమైనది. నమనం = నామః; ఇతరులకు వంగియుండుట అనామశబ్దమునకు నఞ్‌తో బహువ్రీహి చేయవలయును. నవిద్యతే నామః = నమనం = నతిః, యేషాంతే అనామాః = ఎవరికీ తలవంచని రాజాధికారులని బహువ్రీహి సమాసము. నమ్‌ధాతువునకు "క్తిన్" చేరిన "నతిః" "ల్యుట్" చేరిన నమనం; "ఘఞ్" చేరిన నామః అని కృదంత రూపములు శాస్త్ర సిద్ధములు; ఈ శబ్ద నిష్పత్తి ప్రక్రియ మల్లి నాథుని టీకలో కూడ చూపవలసి యుండును. నారాయణ పండితుడు నలపక్షమున వేరొక విధముగా వ్యాఖ్య రచించెను. పూర్వార్థము సమానమే; ఉత్తరార్థమున యా = ఏ నల వ్యక్తి, బహుః = అనేక రూపములు గలదై స్వౌజసాం విలాసైః, క్షమానామ భూమి అను పేరుగల పదం = స్థానమును సాధయితుం అలం; సమర్థమైనది. స్యాత్ = కాగలదు. అలం అనుపదమును అధ్యాహారము చేసుకొన వలయును. ఒకే నలవ్యక్తి అనేక రూపములు గలదై భూమండలము నంతను స్వాధీనము చేసికొన గలదు. దీని మూలమున భూమండలమున నలుడొక్కడే రాజు అని సూచింపబడుచున్నది.

ఈ రెండవ వ్యాఖ్యానమున బహు శబ్దము ఉకారాంతము, సవిసర్గము, స్త్రీ లింగము నలవ్యక్తికి విశేషణము మొదటి పక్షమున బహు నపుంసకలింగము. పదమునకు విశేషణము. మొదటి పక్షమున "క్షమా" అనునది భిన్నపదము. రెండవపక్షమున క్షమా శబ్దము 'భూ" వాచకము. క్షమా.నామ అనునది సమస్త పదము, మొదటి పక్షమున సాధుజనులనెల్ల నలుడేమొదట పరిగణింప తగిన వాడని అర్థము. రెండవ పక్షమున నలుడొక్కడే భూమండలమున రాజని అర్థము.

కవికి పద్యనిర్మాణమునందే స్వాయత్తతగలదు. అందలి గంభీరార్థములను వెలికి చెప్పుట వ్యాఖ్యాతల సొమ్ము. ఈ విధముగా నారాయణ పండితుడు నైషధశ్లోకములకు అనేక విచిత్రార్థములను తనవ్యాఖ్యలో నిరూపించియున్నాడు. ఈ విధముగా తన జీవిత సర్వస్వమును నైషధ వ్యాఖ్యానమునకు ధారపోసినట్లు తెలియగలదు.

వ్యాకరణ పక్షమున పైశ్లోకమునకు సమన్వయ రీతి ఈ విధముగా ఉన్నది.

సాధు = బాగుగా, విభక్తి చింతా = సుప్తిఙ్ విభక్తుల విచారణ, క్రియేతచేత్ = చేయబడినట్లైతే, తదా = అపుడు, సావ్యక్తిః = ఆ విభక్తి (వ్యజ్యతే ప్రాతిపదికార్థః అనయా అనివ్యుత్పత్తి చే వ్యక్తి శబ్దము విభక్తి పరము) ప్రథమాభిధేయా = ప్రథమేతి సంజ్ఞా యస్యాస్సా. ప్రథమ అను సంజ్ఞ గలది. అది ఏదనగా, యా = ఏ ప్రథమాసంజ్ఞ గల విభక్తి, స్వౌజసాం = సు.

జౌ జస్ అను ఏకవచన ద్వివచన బహువచనముల యొక్క, విలాసైః = కార్యవిశేషములచే కలిగిన అనేక పరిణామములచే రామ అను చో విసర్గ, 'రామౌ' అనుచో ఔకారము, రామాః అనుచోట దీర్ఘ సర్గము, కొన్నిచోట్ల నీ భావము, కొన్ని చోట్ల ఆకారము, పైన చెప్పిన ప్రకారములచే బహు = అనేకమైన, నామ = ప్రాతిపదికమును, పదం = సుబంతముగా సాధయితుం = నిష్పాదించుటకు, అవత్ = మిక్కిలి, క్షమా = సమర్థమైనది. ఇచట నామ అనునది భిన్నపదము. ప్రాతిపదికార్థకము, ఇచట నామ అనునది ఘట, పట, మొ॥ ప్రాతిపదికపరము. ఇట్టి ప్రాతిపదికల కంటె సు, ఔ, జస్‌లు చేరగా, సుప్తి జంతం పదం అను సూత్రముచే విశిష్టము పదమగును. అంతియే కానీ కేవల ప్రాతిపదికము పదముకాదు. అందుచే "నామ" అనుపదమునకు, నామప్రకృతికం = ప్రాతిపదిక ప్రకృతిగా గల పదమును; నిష్పత్తిచేయును.

ఈ నారాయణుని టీకకు, మల్లి నాథుని టీకకు ఏకవాక్యత గలదు. ప్రక్రియ మాత్రము కొంత భిన్నముగా ఉన్నది. ప్రథమా, అభిధేయా అని మల్లి నాథుని వ్యాఖ్యలో విభిన్నపదము. ప్రకాశటీకలో సమస్తపదము, "అభిధేయ" పదము మల్లినాథుని టీకలో విచారార్థకము ప్రకాశటీకలో సంజ్ఞాపదము, నారాయణ పండితుడు వ్యాకరణ శాస్త్రీయ ప్రక్రియను ఈ శ్లోకమున వేరొక రీతిని సమన్వయించెను. సాధు విభక్తి చింతా = సాధుత్వ సంపాదకమగు విభక్తి యొక్క విచారణ, ఇచట సాధు శబ్దము ధర్మపరము, సాధుత్వమని అర్థము) క్రమేత చేత్ = చేసినట్లైతే, స్వౌజసాం = సు, ఔ, జస్ అను వాని మధ్యలో (స్వౌజసాం అను నది నిర్ధారణ షష్ఠ్యంతము, సు, ఔ, జస్ ఏషాంమధ్యే = వీనిమధ్యలో) ప్రథమా = మొదటిదైన, సావ్యక్తిః = ఆ వ్యక్తి, అనగా "సు" అనునది, అభిధేయా చెప్పతగినది.

విభక్తి ప్రత్యయములు కర్త మున్నగు కారకములను ఏకత్వము మున్నగు సంఖ్యనూ బోధించుచూ విధింపబడును. ఏ అర్థము లేకుండా అనగా కర్త కర్మలను సంఖ్యను బోధించకుండ ఏ విభక్తి యుండదు. కానీ ఏ అర్థము లేకుండా కేవలము పదసాధుత్వము కొఱకే ప్రయోగింపబడు ప్రత్యయ మేదని విచారణ చేసినపుడు ప్రథమా విభక్తిలో ఏకవచనమగు "సు" అనునది అని సమాధానము చెప్పవలయును. ఏ అర్థమును బాధింపక కేవలము సాధుత్వము కొఱకు ప్రథమైక వచనం "సు" వాడవలెను. దీనినే శాస్త్ర కర్తలు ఔత్సర్గికైక వచనమందురు. దీని వివరణ మును అనుపదమే చెప్పుచున్నాను. అథ, చేత్, నూనం మొ॥ గు అవ్యయములు కారకమునుగాని సంఖ్యనుగాని చెప్పనేరవు. అథ = తరువాత; నూనం = నిశ్చయముగ, అను అర్థమును మాత్రమే చెప్పును. అట్టి తరి సంఖ్యాద్యర్థములు లేనందున విభక్తులెట్లు వచ్చునను ప్రశ్నకు ఈ ఔత్సర్గికైక వచనము చేర్పవలయునని తాత్పర్యము.

యా = ఏ "సు" అను వ్యక్తి బహు = అనేకమైన నామ = సుబంత పదములను నిష్పాదించుటకు తగినదని రెండవ వ్యాఖ్య. ముందు చూపిన అథ నూనం మొ॥గు అవ్యయములకంటె "సు" అను ఔత్సర్గికమగు ప్రథమైకవచనము సంభవించును. "అవ్యయాదాప్సుపః" (అ.సూ.2-4-82) అను దానిచే మిగిలినది సుబంతమగును. ఈ "సు" ప్రత్యయము చేరని యెడల

"నకేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా" అను నియమానుసారముగ అవి ప్రయోగార్హములుగావు. వాటికి ప్రయోగార్హతను సంపాదించుటకై కేవలము నిరర్థకమగు ప్రథమైకవచనము ప్రవర్తించును. దానిమూలముగ అసంఖ్యాకములగు పదములను అనగా అనంతావ్యయములను మూలముగ చేసికొని అనేక పదములు తయారగును. ఈ ఔత్సర్గికైకవచనమును ఇటువంటి 'అవ్యయాదులకే చేయవలయ్యును ఘట, పట, మున్నగు స్థలములలోని ఏకవచనము ఇట్టిదికాదు. దీని భావమును వ్యక్తపరచుటకు వ్యాకరణ శాస్త్రీయ ప్రక్రియ చాలగలదు. దానిని చూపించుచున్నాను.

ఘట, పట, రామ యిన్నగు ప్రాతిపదికల కంటె ప్రథమ మొ॥గు ఏడు విభక్తులు విధింపబడినవి. ఆ విభక్తి ప్రత్యయములు కర్త, కర్మ, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము, సంబంధము అను ఏడు అర్థములలో ఏదోనొక అర్థమునందు విధింపబడినవి. అంతియెకాక "ద్వ్యేకయో ద్వివచనైకవచనే" (అ.సూ.1-4-22) "బహుషు బహువచనం" (అ.సూ.1-4-21) అను రెండు సూత్రములచే ఏకత్వ, ద్విత్వ, బహుత్వ సంఖ్యలలో ఏదేని ఒక సంఖ్య యందు విధింపబడినవి. కాగా కర్త్రాది కారకమును, ఏక త్వాది సంఖ్యను విభక్తి ప్రత్యయములు బోధించును. ఈ అర్థములు లేకుండా ఆ ప్రత్యయము ప్రవర్తింపదు. ఈ కారకవిభక్తులు కాక కొన్ని ఉప పదవిభక్తులు గలవు. అవియు సంబంధార్థమున ఏక త్వాది సంఖ్యయందును విధింపబడినవి. ఈ ప్రక్రియ ప్రకారము పై చూపబడిన అర్థముల యందే విభక్తి ప్రత్యయములు ప్రవర్తించును. ఆ అర్థములు లేకపోయిన ప్రవర్తింపవు.ఇది శాస్త్ర మర్యాద. నీచై, దుస్, దుర్ మున్నగు అవ్యయములు కర్త్రాదికారకములనుగానీ, ఏకత్వాది సంఖ్యలకుగానీ బోధింపనేరవు. వాని అర్థములందు ఈ కర్తృత్వముకాని; ఏకత్వాదికముకానీలేదు. అట్టి సమయమున వానికంటె విభక్తి ప్రత్యయములు చేరవు. ఆ ప్రత్యయముల చేరకపోయిన వానికి పదసంజ్ఞ కలుగదు. పదసంజ్ఞ లేకపోయిన రుత్వ విసర్గాదులు రావు. పదము కాకపోయిన ప్రయోగార్హము కాదు.

ఇట్టి పరిస్థితిలో పతంజలి మహర్షి స్వతంత్రించి ఒక నూతన ప్రక్రియ చూపించెను. "ద్వ్యేకయో ర్ద్వివచనైకవచనే" "బహుషు బహువచనం" అని పాణిని రెండు సూత్రములను చెప్పెను. ఈ సూత్రముల చొప్పున ఏదేని ఒక సంఖ్యకు మాత్రమే సుప్, తిఙ్‌లు వచ్చును. కావున పతంజలి ఈ సూత్రములను కాదని క్రింది విధముగ సూత్రించెను. "ఏకవచనం" ప్రకృతి కంటె ఏకవచనము వచ్చును. ఇది సామాన్య ప్రత్యయము. సంఖ్య లేకపోయిననూ, అర్థము లేక పోయిననూ ఇది వచ్చును. "ద్వయోర్ద్వివచనం" ద్విత్వమున ద్వివచనము వచ్చును. "బహుషు బహువచనం" బహుత్వమున బహువచనము వచ్చును. ఈ నూతన ప్రక్రియలో ద్వి, బహువచనములు ద్విత్వ, బహుత్వముల నపేక్షించును. ఏకవచనమునకు ఆ అపేక్షలేదు. కేవలము పదసాధుత్వమునకే ఈ ప్రత్యయము చేరును. ఇంచుమించుగా ఈ ప్రత్యయమునకు అర్థము లేదని భావము. ఈ పద్ధతిని ఆ శ్రయించి "ఏకవచనముత్సర్గతః కరిష్యతే" అని భాష్యకారుడు నిర్ణయించెను. బహుషు బహువచనం" "అవ్యయాదుప్సుపః" అను సూత్రములలో భాష్యకారు డీవిషయమును స్పష్టముగా చూపియున్నాడు. ఉత్సర్గతః అనగా సామాన్యముగా అని

అర్థము. ఏ అర్థమును అపేక్షింపకుండా వచ్చునని భావము. ఇది కేవలము పదసాధుత్వమునకే వచ్చును. సు, ఔ, జస్ ఈ మూడు వచనములలో మొదటిది అగు 'సు' అనునది ఈ ప్రక్రియకు చెందినది.

ఇంతటి వ్యాకరణ శాస్త్రీయ ప్రక్రియను బాగుగా, తెలిసికొనిన వాడు కనుక శ్రీహర్ష పండితుడు ఈ సూత్రమును తన పద్యములో ఇమిడ్చెను. అట్టికవి యొక్క తాత్పర్యమును వృద్ధ జన సేవచేసి స్వాధీనము చేసికొని స్పష్టపరచిన నారాయణ పండితుడు వందనీయుడు. ఆతడు కేవలము సాహిత్యవేత్తయేకాక, శాస్త్ర రహస్యములను కూడ పెద్దలవలన గ్రహించినాడు. మఱియొక విషయము గలదు. జౌత్సర్గికైకవచనము సాధుత్వార్థమై ప్రవర్తించు ననువారి భావమేమనగా ప్రథమావిభక్తిలో ఏకవచనమే వచ్చునని భావము. ఇది ఒక కోవకు చెందిన సిద్ధాంతము. ఈ సిద్ధాంతము ననుసరించి ఈ శ్లోకము టీకయు వ్రాయబడినవి. ప్రథమైక వచనమేకాక అన్ని విభక్తుల ఏకవచనములు వచ్చునని మఱియొక కోవకు చెందిన సిద్ధాంతము.

మఱియొక సంగతి "జౌత్సర్గికమేకవచనం" అను నది సుద్విభక్తులలోనే కాదు. ఈ ప్రక్రియ తిఙ్విభక్తులలో కూడగలదు. ఎట్లనగా భావేలకారము చేసినపుడు అచట ప్రథమపురుషసూత్రము ప్రవర్తించును. మధ్యమ ఉత్తమ పురుషలు ప్రవర్తింపవు. అందు ప్రథమపురుషైకవచనమే ప్రవర్తించును. దానికే అర్థము అపేక్షితముకాదు. అది కూడ సాధుత్వార్థమే. సాధుత్వార్థమనగా ఏ అర్థము లేనిది అనగా నిరర్థకమని భావము. 'తిఙ్'లలో ఏకవచనమనగా "తా, ఆతాం, ఝు" అను ఆత్మనేపద ప్రత్యయములలో 'తా' అనునది ఏకవచన ప్రత్యయము'భూయతే చైత్రేణ'.

ఇట్లుండగా శ్రీ ముళ్లపూడి జయసీతారామ శాస్త్రి తన గవేషణ గ్రంథములో 'వ్యాకరణ దర్శన పరామర్శ'లో పై శ్లోకమునకొక విచిత్రమగు వ్యాఖ్యను చూపియున్నారు.

"విభక్తీనాం మధ్యే కావా విభక్తిః సాధురితి చింతా క్రియతే చేత్, ప్రథమావ్యక్తిః తత్రసమాధానం భవతి"≠ దాని భావమే మనగా విభక్తుల మధ్యలో ఏ విభక్తి సాధువు అని విచారణ చేసినపుడు ప్రథమా విభక్తి అని సమాధానము వచ్చుచున్నది.

ఈ టీక మల్లినాథుని టీకతో గానీ నారాయణ పండితుని టీకతోగానీ పోలియుండలేదు. ప్రాచీనుల వ్యాఖ్యానములలో "సాధు" అనునది క్రియా విశేషణము నపుంసక లింగము "లెస్సగా" అనియున్నది. అది యుక్తమే. విమర్శకుడు చూపిన వ్యాఖ్యలో విభక్తులలో ఏ విభక్తి సాధువు అని అర్థము చెప్పినచో "సాధు" శబ్దము సమాసఘటకము కాకుండా వ్యస్తపదముగా ఉండవలెను. అట్టి సమయమున "కా విభక్తిః సాధుః" అనువిభక్తి సంబంధమును బట్టి 'సాధుః' అని స్త్రీ లింగములో సవిసర్గముగా ఉండవలెను. శ్లోకములో అట్లు లేదు. కనుక "కా విభక్తిః సాధుః" అనువిచారణ కవితాత్పర్య విషయముగాదు. మఱియు 'విభక్తీనాం మధ్యే' అని వ్యాఖ్యానించినపుడు

---

≠ శ్రీహర్షనైషధమ్ – దర్శన పరామర్శః – 98 పుట.

"విభక్తీనాం" అను సమాసమున విభక్తీనాం అనునది నిర్ధారణ షష్ఠ్యంతముగావలెను. అట్టి తరి 'ననిర్ధారణే' (అ.సూ.2-2-10) అను సూత్రముచే షష్ఠీసమాసము నిషిద్ధమైనందున "విభక్తీనాం చింతా = విభక్తిచింతా" అని ఉండుటయు తప్పగును. సాధుః అనివిసర్గాంతముగా లేక పోవుట; సమాసముచేయుట అనురెండు అంశములు ఈ వ్యాఖ్యానమునకు అనుకూలముగా లేవు. వీరివ్యాఖ్యలో ఈ రెండు దోషములు గలవు; ప్రాచీనుల వ్యాఖ్యలలో ఇట్టి దోషములు లేవు.

మఱియు పైచింతకు ప్రథమావిభక్తి సమాధానమగునని వ్రాసి దాని కుపస్తంభకముగా "కింతు రామాది ప్రాతిపదికానాం విషయే ద్వితీయాదిః విభక్తిః కారకాద్యర్థ ద్యోతనార్థం సంబంధార్థేవ క్రియతే. ప్రథమాతు కర్మాదికారకాణాం (ఉక్తార్థత్వే) అభిహితత్వే ప్రాతిపదికార్థ మాత్రే, లింగమాత్రాద్యాధిక్యే... సర్వత్ర సంభవతి. తదేవ వైశిష్ట్యం మనసి సంధార్య, కవినా పదత్వసాధనే ప్రథమాయోగ్యా విభక్తి రితి పరిగణితా".≠

ద్వితీయాది విభక్తులు ప్రాతిపదికల కంటె చేరవలె ననినచో కర్మాది కారకములు అపేక్షితములుగా ఉన్నవి. ప్రథమ రావలెనవినచో అపేక్షితములుగావు. ప్రాతిపదికార్థ మాత్రము చాలును. ఇది ప్రథమయందున్న వైశిష్ట్యము. ఇట్టి వైశిష్ట్యమును గుర్తించి కవి పైరీతిగ చమత్కరించెను. కాగా పదసాధుత్వము కొఱకు ప్రథమావిభక్తి సరిపోవును.

ఇవి చాల అసంగతము. ఏల ననగా ద్వితీయాదులవలెనే ప్రథమయు కారక విభక్తియే ఈ అంశము లఘుమంజూషలో నాగేశపండితుడు సుబర్థ వాదమున (2185 పేజి) స్పష్టపరచి యున్నాడు. అట్టి తరి ప్రథమా విభక్తి ప్రవర్తించుటలో కర్త్రాది కారకము అపేక్షితమే అనభిహితకారకము ద్వితీయాద్యర్థము. అభిహితకారకము ప్రథమావిభక్త్యర్థమని యే వ్యాకరణ సిద్ధాంత రహస్యమర్యాద. ఈ అంశమును గుర్తింపక స్వకపోలకల్పనచే ప్రథమకు వైశిష్ట్యము కల్పించిరి. మఱియు పదత్వసంపాదనము సునది, ప్రథమకు మాత్రమే సంబంధించినదికాదు అది సర్వ విభక్తి సాధారణము. నెన్నివిధముల చూచినను ఈ విమర్శకుని వ్యాఖ్య ప్రాచీనుల వ్యాఖ్యలకును, శ్రీహర్షుని అభిప్రాయామునకును తగినది కాదని విజ్ఞులు గ్రహింతురుగాక. మఱి యొక వింత. వీరు ప్రాచీను వ్యాఖ్యాతల భావములను గుర్తింపలేకుండుటయేకాక, వారి వ్యాఖ్యల పైదోషములను కూడ ఆపాదించిరి.

అత్ర "ప్రయోగయోగ్యత్వాయ ఏకవచనం ఉత్సర్గతః క్రియతే" ఇతి నారాయణీయ వ్యాఖ్యగతం వాక్యం నతావత్ విమర్శ సహంభవతి. యతః ప్రాతిపదికానాం అవ్యయా నాం ఉత్సర్గతః ప్రథమా క్రియతే, నతు ఏకవచనమ్" ≠ అని నారాయణ టీక విచార సహము కాదు ఏలననగా ప్రాతి పదికములకు, అవ్యములకు ప్రథమా విభక్తియే ఔత్సర్గికముగా వచ్చును ఏకవచనము కాదు.

---

≠ శ్రీహర్షనైషధమ్ - దర్శన పరామర్శః - 99 పుట.

≠ శ్రీహర్షనైషధమ్ - దర్శన పరామర్శః - 99 పుట.

ఇది అత్యంతము హాస్యాస్పదముగా ఉన్నది. కారణమేమనగా నేను జౌత్సర్గికైకవచనములు గూర్చి వివరముగా చూపియున్నాను. అదియే శాస్త్ర సమ్మతము. దానిననుసరించి ఏకవచనమే జౌత్సర్గికము అని విజ్ఞులకు తెలియగలదు. ప్రథమా విభక్తి ఎన్నడు జౌత్సర్గికము కాజాలదు. అసలీ విమర్శకునకు జౌత్సర్గికము అను పదమునకర్థము తెలియలేదు. అట్టి తరి తన అజ్ఞానమును కప్పిపుచ్చుకొని ప్రాచీన వ్యాఖ్యాతలకే అజ్ఞత నాపాదించుచున్నాడు. మఱియు ప్రథమకు జౌత్సర్గికత్వమును ఒక విధముగా చూపియున్నాడు. అదియు అసంగతమని చూపితిని.

(సశేషము)

# శ్రీ మదార్ష పురాణము

## శ్రీ టేకుమళ్ళ రామచంద్రరావు

(గత సంచిక తరువాయి)

వ॥ చిట్టిబొట్టు, అట్లతద్దె, బొమ్మలనోము మొదలగు నూటు నోములలో కొన్నిటి నైనను నోచుటయు, వివిధములగు పేర్లతో స్త్రీ దైవతములను, గ్రామదేవతలను చనిపోయిన పితరులను కొలుచుటయు, చెట్లను, పాములను, రకరకముల జంతువులలోనే యొక దానినే ఒక్కొక తెగవారు పవిత్రముగ నెంచి పూజించుటయు, మంత్రములు లేకుండ కొన్ని యాచారములను పాటించుచు పెండ్లిండ్లు చేసికొనుటయు, వధూవరులొకరిపై నొకరు పసుపు నీరు జల్లుకొనగనే ఆలుమగలగుటయు, కుండ పగులఁగొట్టి విడాకులిచ్చుటయు, స్త్రీ పురుషులు మూఱు మనువు చేసికొనుటయు, పుట్టిన బిడ్డను జల్లెడలో నుంచుట మున్నగు పుత్రోత్సవములు చేయుటయు, 'పోలి' స్వర్గమున కేగుట మున్నగు పండుగలు జరుపుటయు, మరణించిన గొప్పవారితో పాటు మఱొకరినిగాని, కొందఱను గాని పాతిపెట్టుటయో, దహనమొనర్చుటయో జరుపుటయు, మరణ సంబంధమైన కర్మలు కొన్ని నేఁటి వేద ధర్మములకు భిన్నముగ నుండుటయు మొదలగు నాచార సాంప్రదాయములు మా రాజ్యములందు ప్రబలములు. ఇవి ప్రాతెలుఁగుల యొక్కయు తెలుఁగులకు పూర్వ మాయేలుబడిలో నున్న రాజ్య నివాసుల యొక్కయు మిశ్రమాచార సాంప్రదాయములు. 642

తే.గీ. "వేదకర్మలు వీక్షించి, వినిన కొన్ని । తరములకుఁగాని, యివి హానికరముకావు
నుమ్మను కొనరీప్రాంత సూక్ష్మ మిద్ది । తిరుగఁబడుదురు; కూర్తురు మరణ మిచట ॥ 643

తే. గీ. "అంగరాజ్యము భిన్నమీ యిన్ని గుణము । లం దచట మిశ్ర సంస్కృతి యలదె నిపుడు
అచ్చ తెలుఁగచ్చు వైదిక మలరు కలసి । దేని నడ్డిన నైన మర్దింతురోయి" ॥ 644

తే. గీ. పూర్తిగా నన్ని విషయముల్ బోధపడియె । నంగ యాంధ్రాదులకు భిన్నమనియు నెఱిగె
కాని, వేనుఁడు వైదిక కర్మలనిన, । ద్వేషభావంబు మానక పెంచుకొనియె ॥ 645

తే. గీ. ఆంధ్రునకు బుట్టె నొక సుతుఁడతడు కూడ । 'వేనుడ'ను పేర వర్ధిల్లె : వీని నాంధ్ర
వేనుఁడన తొలి యతఁడంగ వేనుడయ్యె । పితలు మరణింప రాజ్యముల్ వీరివయ్యె 646

వ॥ అంగవేను డంతట. 647

ఉ॥ పాలన చేసె భూప్రజ నపార దయన్, దనతండ్రి వాక్యముల్ ।
పాలన చేసి వైదికము ప్రాతెలుగుందన మాదరించుచున్
కాలము సాగనిట్టు లొక ఘస్రము నందు 'మరీచి' నామకుం
డేలిక ( జూడవచ్చి, ధనమిమ్మనె చేయనఖండ యజ్ఞమున్ ॥ 648

ఉ॥ "మీ పరిపాలనన్ జనులు మేటి సుఖంబులు పొంది రెల్లపై
ర్లేపుగ( బండె; వర్షము మహేంద్రు దయన్ గురిసెన్ సకాలమం ।
దీప గిదిన్ సురల్ జరుప కిప్పుడ వర్షపు క్షామ సంజ్ఞలన్ ।
జూపిరి వారు తుష్టిగనుచో క్రతుచర్యకు రావు క్షామముల్ ॥ 649

వ॥ అనిన నంగవేనుడిట్లనియె. 650

క॥ "నదులను, వార్ధుల, చెఱువుల । నుదకము నావిరిగ దీర్చి యొసఁగు జలము వా।
రిదములు; క్రతు సాధ్యముకా । దిది; చూడుడు సర్వమార్గమైదైన నికన్ ॥ 651

చ॥ అని మరీచి యాగ్రహము నంది, బొమల్ ముడివైచి, "వేదముల్ ।
కనుగొనె యజ్ఞ మార్గమును, కాదను రాజపసవ్యు, డట్టియో ।
చనలకు శిక్షగా నిపుడు సాగవలెన్ దశవర్షయాగమో ।
జనగణపాల । వేదము లసత్యము లంచు వచింప( జెల్లునే?" 652

వ॥ అనిన 653

శా॥ వేనుండిట్లనె "కోపతాపములచే వేదోక్తి కౌన్నత్య సం ।
ధానంబున్ ఘటియింప( బోకుము భవద్వాంఛల్ వడిన్ దీర్తునెం ।
దైనన్ నిప్పుల( బోయు నేతిపొగ వ్యోమాభ్రంబుగా మాఱి, వా ।
నై, నీరంబులు గ్రుమ్మరించునను వాక్యంబుల్ దయన్ చూపుచోన్" ॥ 654

ఉ॥ "నామన మందు వేదముల మాన్యతకున్ గల దగ్ర పీఠ మీ ।
క్షామము రాక మాన దది జన్మములన్ గని పాఱిపోదు; నీ ।
కేమిటి కీవృథాశ్రమ, మహేతుక కోపము? నాప్రజావళి
క్షేమము నేను చూచుకొని చేతును చేయఁగ లట్టి దంతయున్" ॥ 655

మ॥ అనినన్ గోపము రెట్టి చేసికొని, రాజాస్థానమున్ వీడి దు ।
ర్జన తత్వంబున వర్తక స్థలమునన్ జాటెన్ "నృపాలుం డహం ।
బున వేదంబును ధిక్కరించి మిడికెన్ పూజ్యుల్ బుధుల్ పెద్దశి ।
క్షను వేయన్ జనుడెం"డటంచు, నిగమజ్ఞానుల్ దరిన్ జేరగన్ ॥ 656

తే. గీ. విని మరీచిని, క్రతు భక్తజనులు కినిసి, । రాజనొద్దకుఁజని, "వేద రక్షకుడవు
కాని నీవనర్హుడ, విఁక గద్దె దిగుమొ । వేగమిపు"డని శపియింప, వేనుఁడనియె ॥ 657

తే. గీ. "క్రతువు వలదంటి; నంతియే కాని, నేను । వేదరక్షణమును మానలేదు, కాన ।
నర్హరహితము మీశాప; మంగ నృపుని । ధిక్కారణ నేరమని మీరు తెలియుఁ డనిన ॥ 658

తే. గీ. బలిమిమై పట్టి, రోటిలో తలనుఁగ్రుక్కి । దంచి చంపిరి రోకళ్ళ దారుణముగ
వేనరాజును క్రూరులా వేదవిదులు । పట్టమహిషి గర్భవతి దుఃఖమున గ్రుంగ ॥ 659

మ ॥ విని యీ ఘోర కఠోర వార్త, గహనాభీలో గ్ర దావాగ్నియై ।
చనుదెంచెన్ వెనవాంధ్రవేను డు మహీ చక్రంబు కంపింపగా దు
ర్జనులన్ యజ్ఞవినోదులన్ గదిసి, నిర్దాక్షిణ్యంబుగా జీల్చి, వే
నునకున్ దర్పణమిచ్చె నెత్తురుల, బంధు ప్రీతి సంధిల్లగన్ ॥ 660

ఉ । వేనుని హంతకాఘుమగు వేదవిదుల్ పరుగెత్త వారి నె
మ్మేనులు చీల్చి ముక్కలుగ, మేపెను వాయస, గృధ్ర పంక్తి; క ।
జ్ఞానులమోగుణిన్ గుమతి ఛాంధసమూర్ఖ మరీచిదైలవుం
గానుగఁ బిప్పి చేసి, శునకంబులకున్ బడవైచె కాయమున్ ॥ 661

తే. గీ పృథుని ( బ్రసవించె నపుడంగ వేను రాణి । అతఁడు పెద్ద వా డ గువలకామె రాజ్య
మేలె పిమ్మట పృథుఁడేలె పెక్కు నాళ్ళు । చేరె నపుడట వేద సంస్కృతులు మరల॥
662

వ ॥ పృథునకు 'అర్ణి'యు, 'అర్ణి'కి హవిర్ధానుండును జనించి, క్రమముగా నంగ రాజ్యమేలిరి.
663

తే. గీ ఆంధ్ర వేనుఁడు బహుకాల మవని నేలి । ఆంధ్ర జన శుభైశ్వర్యాభివృద్ధి ।
పాదుకొల్పెను తెలుఁగుల ప్రభలు వెలుగ । పిదప, సుతుడు నిషాదుఁడు పృథ్వి నేలె॥
664

వ ॥ చక్రవర్తియను రెండవ కుమారుడు వేఆాక రాజ్యమునకు రాజయ్యెను. 665

తే. గీ. ఆంధ్ర, వంగ, కళింగ, సింహ భువిజనుల । వేదబాహ్యులుగా వెలివేయ మిశ్ర ।
ప్రాంతవాసులు, వీరు నా ।ప్రాంతజనుల । నటులె వెలివెచి [illegible] ॥ 666

# పరశురాముడు

. గీ. దండకాటవి ప్రాఙ్మధ్య ధరణులందు
గాధి సుతుడెల్లు వేదమార్గమును వ్యాప్తి
చేయబూనెనా తెలుగుల సీమలందు
నితర జన సీమలందుసు నెలమి సటులె ॥ 667

॥ తపతి సర్మద సహ్యాద్రి దాపులందు
నిలిచె జమదగ్ని యచ్చటి తెలుగువారి
కితరులకు వేదమార్గము నెరుకచేయ
పాత వాసుల రేణుకన్ బెండ్లి యాడె 668

॥ సలుగురు తసయులు వారికి
కలిగిరి మూడవ సుతుడు జగద్వంద్యుడు గొ
డ్డలి యాయుధమైన ఘనుడు
చెలగె బరశురాముడన ప్రసిద్ధుండగుచున్ ॥ 669

॥ అలఘు పతివ్రతా తిలకమా సతి రేణుక నర్మదానదీ
జలమును నిత్యమును సికతజాల వినిర్మితమైన కుండతో
నెలవుకు దెచ్చు చుండె; ధరణీపతి నీడను నీట జూచియ
వ్వెలది మదిన్ జలించె నొక వేకువ వేళను కుండ చిట్లగన్ ॥ 670

॥ తన పాపమెరిగి యింటికి
జని భర్త నడిగె శిక్ష సాధ్వీమణియా
ముని మరణ శిక్ష తగునని
తనయులతో జెప్పె నామె తలవిడగొట్టన్ ॥ 671

. గీ. సుతులు మూవురు తల్లిని హత మొనర్ప
నొల్లరెరి పరశురాము డొక్కవ్రేటు
తో జనని తలద్రుంప దృప్తుడయిన ముని
వరమడుగు మిత్తు ననె పుత్రవరునితోడ ॥ 672

॥ అంత నాపరశురాముడు. 673

క॥ బ్రదికింపగోరె తల్లిని
సదయత నంగీకరించి జమదగ్ని "శిరం
బదికించు మొండెమున" కనె
వదికించుటతో సజీవి యయ్యె వనితయున్ ॥ 674

తే॥ తల్లి తలకొట్టునప్పుడా తల్లి వెనుక
నిలిచి యుండిన వేరొక నెలత తలయు
నవని దుల్లె పరశురాముడదుకునపుడు
తల్లి తల నా పురంధ్రి గాత్రమున కదికె ॥ 675

తే॥ అవయవములందు శిరము ముఖ్యంబుగాన
పడతిని గ్రహించె జమదగ్ని భార్యగాను
చావు మూడిన రెండవ చాన శిరము
నదుక నచటి మొండెమున కదియు బ్రదికి 676

గీ॥ ఏగెనింటికి; కొన్నేండ్ల కచటి
కేడు కార్తవీర్యుడు ధిక్కరించి మునిని
వేదమును మిశ్ర సంస్కృతిన్ పీకివేసి
యాశ్రమము తోలుకొని పోయె నావులన్ని ॥ 677

ఉ॥ ఆజమదగ్ని సూను డవుడాగ్రహమందికుఠారహస్తుడై
రాజును గాంచి యీగతి గిరాతక చర్యకు బూనుటొప్పునే?
నీ జవ సత్వముల్ ఘనత, నీరణకౌశలముందలంచి ని
ర్వ్యాజముగా మునీశ్వరుల బాధలు పెట్టెదు నిన్ను ద్రుంచెదన్ ॥ 678

ఉ॥ రమ్మిపు డాహవంబునకు రాక్షసబుద్ధి భవన్మదంబు గ
ర్వమ్మును నేనడంతు సమరంబున నంచు సవాలుచేసినన్
నెమ్మనమందు నేత్రముల నిల్చిన రోషము సాంధ్యసూర్యబిం
బమ్ముగ జేయ మోమును క్షమాతల నాథుడు లేచె నుగ్రుడై ॥ 679

క॥ ఇరువురు యుద్ధము చేయగ
ధరణీతలం మదర జొచ్చె; ధాత్రి రుహంబుల్
గురుతర ఝుంఝా నిలముల
తెరయె మాడ్కి వణకె మహీస్థలి గూలెన్ ॥ 680

క ॥ ఒకరి నొకరు పరిమార్పగ
రకరకముల యెత్తులును పరాక్రమ శక్తుల్
ప్రకటించిరి యమభటులే
యొకరి యసువులో కాని చన నోపిక పట్టన్ ॥ 681

చ ॥ తుద కపరాహ్ణవేళ రవిత్రొక్కు బ్రతీచికి జేరుబాట సం
పదలను రాజ్యమున్ సతిని బంధుల బుత్రుల వీడి యంతకున్
సదనము జేరు వేడ్క జనె క్ష్మాతలనాథుడు కార్తవీర్యుడం
బుదముల ద్రోసి కొంచటన పుణ్యులు స్వాగతమీయనిల్వగన్ ॥ 682

సీ. ॥ తెలుగు సంస్కృతి దివిజుల సంస్కృతియు గూడి
మిశ్ర సంస్కృతియై సమీరమట్లు
వ్యాపించె నుత్తర భరతఖండంబున
దక్షిణాపథమున దాని వ్యాప్తి
కై జమగ్నియు గాథేయుడును పూను
కొనిరి తెలుగులందు, కోయలందు
నిట వసియించిన యితరులందీ యుద్య
మాదియౌ కార్తవీర్య నరపాలు

గీ ॥ నుడిపి వెదకి వెదకి బట్టి పుడమి ధవుల
కొఱకు వారిని రణమున గూల్చె భువిని
పరశురాముడు గొడ్డలి పట్టి తిరిగి
దారి సులువయ్యె కార్య సాధనకు నపుడు ॥ 683

## ఆంధ్రుల వెలితీరుట – కౌసల్యాపరిణయము

వ ॥ ఆంధ్రులు వెలి వేయబడిన పిమ్మట, చాలకాలమునకు రఘువంశ సంభవుండగు దశరథుని బాల్యదశా కాలమున, ఆంధ్ర, సింహ, కళింగ దేశములే కాక, ఉత్కళ, కిష్కింధ, కోయ (గాండు) దక్షిణకోసల, కరూశ, శబర, పుర్కాది దేశములు కూడ ఆంధ్ర దేశములై యుండెను. విదేహ, ఉత్తరకోసల మొదలగు గంగానది కుత్తర దేశముల ప్రజలు మిశ్ర సంస్కృతిని ఆదరించుచుండ వారిలో బ్రాహ్మణులు క్షత్రియులు వేద సంస్కృతి పట్లను గీర్వాణ భాష పట్ల ఎక్కువ ఆదరభావము చూపుచుండిరి. ఆంధ్ర రాజ్యములు

కాలక్రమమున తమ ప్రా తెలుఁగు ఆచార సాంప్రదాయములను సడలించుకొను, వానితో పాటు వేద సంస్కృతిని ఆదరించుటకును అనగా మిశ్రమ సంస్కృతి అవలంబించుటకును, విశ్వామిత్రుని సంతతి వారి కృషి ఫలితము సిద్ధపడుతుండెను. తరుణమున విశ్వామిత్రుడు దశరథుని తండ్రి యగు అజునికడకేగి యిట్లనియె 684

మ ॥ "ఇనవంశాధిప! ఆంధ్ర రాజ్యములతో నిన్నేండ్లుగా మైత్రితో
మనమేనాఁడు మెలంగమైతి, మిది సంభావ్యంబు కాదవ్వియున్
ఘున శక్త్యుక్తి యుతంబులౌట స్ఫుటమై కాన్పించె, నీ దూరబు
ద్ధిని సారించి, పరస్పరైక్య మభివృద్ధిన్ జేయుటల్ మేలగున్ ॥ 685

క ॥ "వెలిపెట్టితి మిన్నేండ్లును । బల, సంస్కృతులందు మనము ప్రాజ్ఞుల మనుచున్ ।
అలవడె మన సంస్కృతి వా రల కిపుడింక, వెలిసాగరాదు నృపాలా ॥ 686

తే. గీ. "శీతగిరులును, తద్యామ్య సీమలెల్ల । భిన్నతల నన్నిటిని గలుపు తిన్ననైన ।
ఏక సంస్కృతి మయములై యెసఁగ వలయు । సాబగు పూసలమంగళ సూత్రమట్లు
687

తే. గీ "అంబరమున తారలకు శశాంకు మాడ్కి । రాజులకు పైన నొక్క రారాజు వలయు
అర్కవంశజుఁడే యిందు కర్హుఁడగును, । ఆంధ్ర వనిత నీ కోడలై యలరునేని ।
688

తే. గీ. "ఈ పగిది, తెలుంగము దేవునింటివాఁడ । వైన నీవును, నాయింటి యాంధ్ర ధవుడు
వియ్యమందినచో ముఖ్య విఘ్న ముడిగి । ఇరు బలములుండు నీ శాత్రు కరము నందు
689

తే. గీ. "ఆంధ్ర రాజ్య చయమునకు యామ్యమందు । వటులు గహనము రాక్షస వ్యాపితంబు
మలయు నొక్కెడు ఋష్యాశ్రమములు, పక్షి । కోయ, వానరా, ద్యితరుల గూడె ములును।
690

తే. గీ "ఈ మహీ భాగ మేకమయ్యేడు పునాది । వేయవలె నాంధ్ర వనితను, బెండ్లి చేసి ।
నీ కుమారున కిటులీవు నిర్ణయంబు । గైకొనిన, నేను సాధింతు కార్యసిద్ధి ॥ 691

క ॥ "కలదు కదా దక్షిణకో సలయను నాంధ్ర ధరణి సుఖ సంపన్నంబై ।
బల, విద్యా, గుణయుతమై । తలమానిక మాంధ్ర రాజ్యతతి నీనాటన్ ॥ 692

క ॥ "ఆ రాజేంద్రుని పుత్రిక । వీరాంగన, సద్గుణఖని, విలసత్ రంభా ।
నీరాజిత లావణ్య, సమారాధిత భార్గవీ కృపార్ణవ యొప్పున్ ॥ 693

మ ॥ "తగు నాకన్నియ నీకుమార రవి, కాతండున్ తగున్ కన్యకున్
తగదే సన్నివిధంబులన్, జరుగు టీ దాంపత్య" మంచు పచిం
పఁగ మౌనీంద్రుఁ, డజుండు సంతసమునన్ వాక్రుచ్చి యంగీకృతిన్
తగురీతిన్ దన ధన్యవాదముల నందన్ జేసే సాష్టాంగియై ॥ 694

తే. గీ. అంత, దక్షిణ కోసలాధ్యక్షు దర్శిసి, । యజున కెట్టుల చెప్పెనో యటులె చెప్పి
కబురు పంపంగఁ జేసెను గాథి పట్టి । యజునకు దశరథు పరిణయము గూర్చి ॥ 695

వ ॥ అజు డియ్యకొనిన వెంటనే పెండ్లి పనులు ప్రారంభమైనవి. 696

క ॥ ఆకస మంతటి పందిరి । ఈ కాశ్యపి యంత తిన్నె, యందు జ్యోత్స్న ।
నీకముఁ జల్లెడు దీపా । నేకము లేర్పరచె నాంధ్ర నృపవరు డంతన్ ॥ 697

వ ॥ ఆ వివాహవేదిక యందు. 698

మ ॥ అమరాచార్య సమ ప్రభావుడు వశిష్ఠాచార్య నిర్ణీత ల ।
గ్న ముహూర్తంబునఁ బెండ్లి యయ్యె నజుడున్, గౌసల్య, యాంధ్రుల్; తెలుం ।
గములున్, కోయలు, దేవతల్, కలసి పల్కన్ మేటి యాశీర్వచ ।
స్సముదాయంబులు, వాద్య వేదముల ఘోషల్ మ్రోయ కర్ణంబులన్. 699

వ ॥ అజుని పిమ్మట దశరథుడు ఉత్తరకోసల దేశాధిపుడై, కౌసల్య పట్టమహిషిగా తన పూర్వుల వలె సరయూనదీ తటంబున గల అయోధ్య రాజధానిగా రాజ్యమేలుచు సుమిత్ర, కైక అను నారీమణులను గూడ వివాహమై కౌసల్య యందు రాముని, కైకయందు భరతుని, సుమిత్ర యందు లక్ష్మణ, శత్రుఘ్నులను కవలలనుఁ బడసి, ఆ కుమారులకు వసిష్ఠుని చే నన్ని విద్యలను నేర్పించెను. రామలక్ష్మణు లొకరినొక రెడబాయక మసలు చుండిరి. అప్పుడు విశ్వామిత్రుడు 700

మ ॥ తరుణంబయ్యెను కోసలాత్మజ సుతున్ దైత్యాంతకున్ జేయ, సు
గ్రరణంబందున దిగ్జయంబొసఁగు శస్త్ర, వ్యూహ, ఖడ్గాస్త్రపుం వెరవుల్
నేర్పగ, నంచు గాధి సుతుడుర్వీనాథు దర్శించి దా
శరథిన్ బంపఁగఁ గోరె నాశ్రమముకున్ సంగ్రామ విద్యార్థమై ॥ 70

సీ ॥ "భరత ఖండపు రాజ వంశంబులన్ రఘు । వంశమే యగ్రాగ్ర వంశమధిప
అవని తెలుంగము, లాంధ్రులున్, సురలును । మిళిత సంస్కృతి గల్గి మెలఁగు మఁ
రాక్షసుల్ దండకారణ్యంబునన్ నిల్చి । గిరులెరి మన సుసంస్కృతికి, మనకు
ఏకసంస్కృతియును నేక ఛత్రాధిపత్యంబును నెలకొల్పు టవసరమ్మౌ

గీ ॥ ఆంధ్ర, తెలుఁగు సంస్కృతు లేకమయ్యె నెపని
తనువున, నతఁడె యిందుకు తగినవాఁడు
వాఁడె రాముడు, నీపట్టి, భానువంశ్యు
డితఁడు, నేర్వవలయు విద్యలింకఁగొన్ని ॥ 70

తే.గీ "ఇనుపవిల్లులు, విశిఖంబు, లినుపగదలు । ఇనుపగోళ్ళును, మారణ హింసకైన
ఇతర సామగ్రి వాడుదురీ దనుజులు । కాన, రామునకుఁదగు శిక్షణము వలయు. 7

తే. గీ "నేను రణవిద్యలన్నిటిన్ నేర్పఁదలఁచి । యతనిఁ గొనిపోవ వచ్చితి నాశ్రమమున
కతని తోఁడుగ నింకొక్క సుతునిఁగూడ । పంపుచో, జోడుగా నేర్తు రంప విద్య । 7

తే. గీ అనిన, నృపతియుఁ గౌసల్య హర్షమంది । సతి సుమిత్ర, నమాత్యుని సంప్రదించి
రామలక్ష్మణులనుఁ బంపి రా మునీంద్రు । వెంట మరుసటి శస్యషర్వేళ యందు । 7

వ ॥ అట్లు రామలక్ష్మణులనుఁ దోడ్కొని చని, 70

ఉ ॥ వారికి యుద్ధ విద్యల నపారముగా ముని నేర్పి, యంగజా ।
తారినిఁగూడ సంగరము నందున గెల్చెడు నేర్పు మీకుచే ।
కూరెను దీని రాక్షసులఁ గూల్చుటకై యుపయోగపర్చి, యీ ।
భారత ధాత్రి నేకముగ భాసిలఁ జేయుఁడు మీరలిర్వురున్" ॥ 70

తే. గీ అని, సుబాహుఁడు, మారీ చుఁడనెడు రాక్ష । సులుగల యెడకుఁగొనిచని, గెలువ వలఁ
ముందుగా వీరినని తెల్పి, మునివరుండు । తొలి పరీక్ష మీకిది యని పలికి, నిలిచి । 7

 (ఇంకావుంది).

# సంస్కృత సాహిత్యములో గద్య వికాసము

శ్రీమతి. హేమలతా బాలసుబ్రమణ్యం M.A., (Skt)

కవేః కర్మ కావ్యమ్ అని కావ్య శబ్దమునకు నిర్వచనము. కావ్య రచనల వలన ఫలమేమనే ప్రశ్నలో మనకు అనేక విధములైన సమాధానములు లభించును. మనకు ప్రథమముగా కావ్య ప్రకాశ కర్త అయిన [1] మమ్మటుని మత ప్రకారము, కావ్య కరణము వలన యశస్సు, ధనము, ఆచారజ్ఞానము, అమంగళ నివారణము, రసానుభవము వలన జన్యమైన ఆనందము, ఉపదేశము కలుగునని తెలియుచున్నది. అనగా కాళిదాసాదులార్జించినటు వంటి కీర్తి శ్రీహర్షాది మహారాజుల ఆస్థానములో వుండి, ధావకాది మహాకవులు తమ కవితామాధుర్యముచే వారిని మెప్పించి, పురస్కార రూపముగా పొందిన ధనము, మంచి ఆచారజ్ఞానము కొఱకును, అమంగళ నివారణము కొఱకును మయూరాది కవులు సూర్యాదిశ తకములు రచించి మనలను ఆచార వంతులుగా చేసిరి. ఇటువంటి మహా కావ్యపఠనమువలన విభావాదుల తోకూడిన ఒక అనిర్వచనీయమైన ఆనందము మనలో కలుగును ఒక ప్రియమైన పత్ని, తన పతికి "ఇలా చేయవలెను, ఇలా చేయరాదు' అని ఎలా ప్రేమగా చెప్పుకొనునో అలాగే మంచి కావ్యము "రామాదులవలె ఉండవలెను రావణాదులవలె అసభ్యముగా ప్రవర్తించరాదు" అని ఉపదేశము చేయును.

ద్వితీయముగా [2] సాహిత్య దర్పణోక్త ప్రకారము కావ్యము వలన చతుర్వర్గఫల ప్రాప్తి కలుగునని తెలియుచున్నది. చతర్వర్గమనగా ధర్మార్థ కామ మోక్షములు. ఈ చతుర్వర్గ ఫల ప్రాప్తి యొక్క ఉపపాదనము ఉత్తమ కావ్యరచన, పఠనముల వలన కృత్యాకృత్య విషయములందు ప్రవృత్తి నివృత్తి కలుగును. అంటే మహా కావ్యమైన రామాయణ పఠనము వలన శ్రీరామచంద్రాదుల అభ్యుదయమును, రావణాదుల సర్వనాశమును చూచిన (చదివిన) తరువాత ధర్మ ప్రవృత్తి కలిగి యుండిన అవశ్యముగా అభ్యుదయము కలుగుననే నిశ్చయాత్మకమైన బుద్ధి మనలోకలుగును. ఈ విధముగా ధర్మ కార్యమందు ప్రవృత్తి అధర్మ మందునివృత్తియు కలిగి, అటువంటి ధర్మాచరణము వలన అర్థము, అర్థలాభముచేత కామము అంటే సుఖము కలుగును. ఎవరైతే ఈ త్రివర్గములను పరిత్యజించెదరో వారికి మోక్షము కలుగునని భావము.

---

1. కావ్యం యశసే౽ర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే ।
సద్యః పర నిర్వృతయే కాంతా సమ్మిత తయోపదేశయుజే ।
2. చతుర్వర్గ ఫల ప్రాప్తిః సుఖాదల్పధియామపి ।
కావ్యాదేవయతస్తేన తత్స్వరూపం నిరూప్యతే ।



ఇంత వరకు మనము కావ్య ప్రయోజనమును గూర్చి చర్చించి ఇప్పుడు ఈ కావ్యము యొక్క లక్షణము అంటే స్వరూపమును గూర్చి తెలుసుకొందాము. ఎందరో లాక్షణికులు కావ్యమునకు అనేక లక్షణములను తెలిపి యున్నను రసగంగాధర కర్త అయిన పండిత జగన్నాథుడు, [3] ఏ శబ్దము రమణీయమైన అర్థమును ప్రతిపాదించునో అదే కావ్యమని పేర్కొన్నాడు. ఈ లక్షణము అధికరమణీయముగా గోచరించుచున్నది. ఈ లక్షణానుసారము ఏశబ్దమైతే జనుల యొక్క శ్రవణ పుటములందు సుధాధారను ప్రవహింప చేయుచూ వారి హృదయములయందు అనిర్వచనీయమైన ఆనందోల్లాసమును కలుగచేయునో, సకల జన మనోజ్ఞమై యుండునో అదియేకావ్యము అని తాత్పర్యము.

ఇటువంటి కావ్యము దృశ్య, శ్రవ్య భేదముచేత ద్వివిధము. అభినయాత్మకమైన దృశ్యము లోక ప్రసిద్దిని పొందియున్నది. ఇక శ్రవ్యకావ్యమైతే పద్యము గద్యము అని రెండు విధములు పద్యాత్మకమైన శ్రవ్యకావ్యము ఛందోబద్ధముగా నుండును. "పాదేషు భవం పద్యం" అని పద్య శబ్దము యొక్క నిర్వచనము. మహాకవియైన దండి తన ఆలంకారిక గ్రంథమైన కావ్యాదర్శములో [4] పద్యలక్షణమును చక్కగా తెలిపియున్నాడు. పద్యము నాలుగు పాదములతో కూడినది, అక్షర సంఖ్యాతమైనది వృత్తము. మాత్రా సంఖ్యాతమైనది జాతి. [5] ఈ పద్య కావ్యము కూడ మహాకావ్యము ఖండకావ్యము, ఉపకావ్యము అని మూడు విధములు.

మహాకావ్య లక్షణములతో కూడిన ది మహాకావ్యము[6] అంటే ఏ కావ్యములో నగర, సముద్ర, పర్వత, ఋతు, సూర్య, చంద్రోదయ, ఉద్యాన, జలక్రీడ, సురాపాన, రతిక్రీడ విప్రలంభా శృంగారము, వివాహము, కుమారజననము, మంత్ర, దూత, ప్రయాణ, నాయకాభ్యుదయాది వర్ణనలు నిబద్ధముచేయ బడి యుండునో అట్టి కావ్యమును మహాకావ్యమందురు. సంస్కృతములో నైషధము - శిశుపాలవధ , రఘువంశము మొదలగునవి మహాకావ్యములు.

---

3. రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్ ।
4. పద్యం చతుష్పదీ తచ్చ వృత్తం జాతిరితిద్విధా ।
5. వృత్త మక్షర సంఖ్యాతం జాతిః మాత్రా కృతాభవేత్ ॥ ఛందో మంజరీ ॥
6. నగరార్ణవ శైల ర్తు చంద్రార్కోదయ వర్ణనైః ।
ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవైః ।
విప్రలంభైః వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః ।
మంత్రదూత ప్రయాణాది నాయకాభ్యుదయైరపి ॥
ఏతైరుపనిబద్ధం యత్త న్మహాకావ్యమిష్యతే ।
ఏషాం అష్టాదశానాం యైః కైశ్చిన్న్యూనమపీష్యతే ।
సర్గబంధో మహాకావ్యమితికేచిత్ ప్రచక్షతే ।
7. భవేత్కావ్యస్యైకదేశానుసారి చ । ఆ విఖండ కావ్య లక్షణమ్
8. గీత తాలాను బద్ధం యదు పకావ్య మితీష్యతే ।

మేఘదూతము, ఋతుసంహారము, ఖండకావ్యములు,[7] గీతగోవిందాదులు ఉపకావ్యములు[8]

ఇక ప్రస్తుత విషయమైనటువంటి గద్యాత్మకమైన శ్రవ్య కావ్యమును చూద్దాము. ప్రథమముగా గద్యశబ్దము యొక్క నిష్పత్తిని చూద్దాము. "గద-వ్యక్తాయాం వాచి" అనేధాతువు నుండి "గద మద చర యమశ్చానుపసర్గే" అనే కర్మణి ప్రయోగములో "యత్' ప్రత్యము రాగా "గద్యం" అనే రూపము నిష్పన్నమగును. "స్తనగ వీదేవశబ్దే" అనే చౌరాదికమైన నిజంతమునుండి "అచోయత్" అని భవార్థములో "యత్" ప్రత్యయము రాగా కూడా "గద్యం" అనే రూపం నిష్పన్న మగును.

ఇటువంటి 'గద్య'ము అగ్ని పురాణోక్త ప్రకారముగా ఆఖ్యాయికా, కథా ఖండకథా, పరికథా, కథాలికాయని పంచవిధముగా నున్నది. కాని ప్రముఖ గద్యకర్త అయిన మహా కవి దండిమతములో ఖండ కథాది భేదములు కథా ఆఖ్యాయికలందే అంతర్భాగమును పొందుట వలన గద్యాత్మకమైన శ్రవ్యకావ్యము రెండు విధములే యని తెలియు చున్నది. విషయమును అతడు తన అలంకార గ్రంథమైన [10] కావ్యాదర్శములో తెలిపియున్నాడు.

ఇదే కాకుండ ఇతడు కథా ఆఖ్యాయికల లక్షణమును తన కావ్యాదర్శములో యిట్లు తెల్పియున్నాడు.

గద్యం తుగ దితం ద్వేధా కథా వాఖ్యాయికేతిచ ।
కథా కల్పిత వృత్తాంతా సత్యర్థాఖ్యాయికా మతా ॥

అంటే కథా పరమైన గద్యము కల్పితముగాను, అఖ్యాయికా పరమైన గద్యము సత్యముగాను (జరిగినది జరిగినట్లు గాను) నిబద్ధమై ఉండును. కాని [11] అగ్ని పురాణములో కథ, ఆఖ్యాయికల లక్షణము వేరు విధముగా చెప్ప బడియున్నది. ఎక్కడైతే కవి శ్లోకములతో

---

9. ఆఖ్యాయికా కథా ఖండకథా పరికథా తథా ।
కథాలికేతి మన్యంతే గద్య కావ్యం చ పంచథా ॥ ఇత్యగ్నిపురాణే పంచ విధమ్.

10. తత్ కథాఽఽఖ్యాయికే త్యేకాజాతిః సంజ్ఞా ద్వయాంకితా ।
అత్రై వాంతర్భవిష్యంతి శేషా శ్చాఖ్యాన జాతయః ॥

11. అగ్నిపురాణము
శ్లోకైః స్వవంశం సంక్షేపాత్కవిర్యత్ర ప్రశంసతి ।
ముఖ్యస్యార్థావ తారాయ భవేద్యత్ర కథాంతరమ్ ॥
పరిచ్ఛేదో నయత్రస్యాత్ భవేద్వాలంభకైః క్వ చిత్ ।
సాకథానామ, తద్గర్భే నిబధ్నీయాచ్చతుష్పదీమ్ ॥
కర్తృవంశ ప్రశంసా స్యాద్యత్ర గద్యేన విస్తరాత్ ॥
కన్యాహరణ సంగ్రామ విప్రలంభ విపత్తయః ॥
భవంతి యత్ర దీప్తాశ్చ రీతి వృత్తి ప్రవృత్తయః ॥
ఉచ్ఛ్వాసైశ్చ పరిచ్ఛేదో యత్ర సా చూర్ణి కోత్తరా ।
వక్త్రం చాపర వక్త్రంచ యత్ర సాఖ్యాయికా మతా ॥

సంక్షిప్తముగా తన వంశ వర్ణనము చేయునో ప్రధానమైన విషయావతరణము కొఱకు కథాంతరమును చెప్పునో ఎక్కడైతే పరిచ్ఛేదముండదో దానిని కథ యందురు. ఇదే విధముగా ఎక్కడైతే కన్యాహరణాదుల వలన యుద్ధములు సంభవించునో, కావ్యాంగములైన వైదర్భ్యాది రీతుల, వృత్తుల, ప్రవృత్తుల, వర్ణనలుండునో, ఉచ్ఛ్వాసముల సంజ్ఞతో గ్రంథ పరిచ్ఛేదము చేయబడునో, ఎక్కడైతే వక్త్రం, అపరవక్త్రం మొదలగు ఛందస్సుల చేత శ్లోకములు నిబద్ధము చేయబడి యుండునో అది ఆఖ్యాయికా యని చెప్ప బడును.

ఇక సాహిత్య దర్పణోక్త ప్రకారము[12] కథా, ఆఖ్యాయికల లక్షణము కొంచెముగా భేదము కనపడుచున్నది. కథాత్మకమైన గద్యమందు రసాత్మకమైన కథా వస్తువు గద్యముతో నిబద్ధమై యుండును. ఇక్కడ ఆర్యావక్త్రం, అపరవక్త్రం మొదలగు ఛందో ప్రయోగముండును. ప్రారంభములో పద్యములతో కూడిన నమస్కారము, ఖలాదుల చరితము నిబద్ధమై ఉండును. ఆఖ్యాయిక కథా తుల్యమై ఉండును. కాని దీనిలో కవి యొక్క వంశము వర్ణింప బడి యుండును. అన్యకవుల వృత్తాంతము అక్కడక్కడ ఉండును. ఇక్కడ కథా భాగములు ఆశ్వాసములనే పేరుతో నుండును. ఆర్యా వక్త్రం, అపరవక్త్రం మొదలగు ఛందస్సుల ద్వారా ఆర్యోక్తుల చేతనూ, ఆశ్వాసము యొక్క ప్రారంభములో భావికథా సూచన కూడా ఉండును.

అందువలననే సాహిత్య లక్షణ గ్రంథము లందు బాణ భట్ట రచితమైనటు వంటి ప్రసిద్ధ గద్య కావ్యమైన కాదంబరి కథాయని పరిగణింప బడుచున్నది.

[13] సాహిత్య దర్పణోక్త ప్రకారము ఈ గద్యము నాలుగు విధములుగా ఉన్నది. అవి ముక్తకము, వృత్తగంధి, ఉత్కలికా ప్రాయము, చూర్ణకము. మొదటిది ముక్తకము. ఇది

---

12 సాహిత్య దర్పణములో :-

కథాయాం సరసంవస్తు, గద్యైరేవ వినిర్మితం ।
క్వచిదత్ర భవేదార్యా క్వచిః వక్త్రా పవక్త్రకే ॥
ఆదౌ పద్యైర్నమస్కారః ఖలాదే వృత్త కీర్తనమ్ ॥
ఆఖ్యాయికా కథా వత్స్యాత్ కవేర్వంశాను కీర్తనమ్ ।
అస్యామన్యకవీనాంచ వృత్తం పద్యం క్వచిత్/క్వచిత్ ॥
కథాంశానామ్ వ్యవచ్ఛేద ఆశ్వాస ఇతి బధ్యతే ।
ఆర్యా వక్త్రా పవక్త్రాణాం ఛందసా యేనకేనచిత్ ।
అన్యాపదేశేనా శ్వాసముఖే భావ్యర్థసూచనమ్ " (6వ పరిచ్ఛేదము)

13. సాహిత్య దర్పణోక్త ప్రకారము గద్యభేదములు :

వృత్తబంధోజ్ఝితం గద్యం ముక్తకం వృత్తగంధి చ ।
భవేదుత్కలికా ప్రాయం చూర్ణకంచ చతుర్విధమ్ ॥
ఆద్యం సమాసరహితం వృత్త భాగయుతం పరమ్ ।
అన్య దీర్ఘ సమాసాఢ్యం తుర్యంచాల్పె సమాసకమ్ ॥

సమాసరహితముగా నుండును. ఉదా : కాదంబరి కథా ముఖములోని ఒక గద్య వాక్యము ఇలా ఉన్నది. "యశ్చ మనసి ధర్మేణ, కోపే యమేన, ప్రసాదే ధన దేన, ప్రతాపే వహ్నినా, భుజేభువా, దృశి శ్రియా, వాచి సరస్వత్య ముఖేశశినా, బలేమినుత ద్రజ్ఞాయం సురగురుణా. రూపే మనసిజేన, తేజసి సవిత్రా!.

ద్వితీయము వృత్తగంధి. ఇది పద్యభాగముతో కూడి యుండును. కాదంబరి పూర్వ భాగములో దీనికుదాహరణము ఇలా యున్నది : "అంబికాకర తలమివ రుద్రాక్ష గ్రహణ నిపుణమ్, శిశిర సమయ సూర్య మివ కృతోత్తరా సంగమ్, వడవానలమివ సతత పయో భక్ష్యమ్ ........... జాబాలిమ్".

తృతీయము ఉత్కలి కాప్రాయము. ఇది అతి దీర్ఘ సమాసముతో కూడి యుండును. కాదంబరి పూర్వ భాగములో దీనికుదాహరణము ఇట్లున్నది. ఉద్దామకేకారవామీయ మాన మరకత మట్టి మస్థిత శిఖండిమండలం, అతి శిశిర చందన విట పిచ్చా యా విషణ్ణ నిద్రాయ మాణ గృహసారసమ్ .... రాజకులమ్. ఇచ్చటి వాక్యము ఉత్కట పదములతో కూడి యున్నది.

చతుర్థము చూర్ణకము., ఇది అల్పసమాసముతో కూడి యుండును. అంటే ఇక్కడ దీర్ఘ సమాసము లే సందు వలన వాక్యములోని పదములు లలితములుగా అంటే- అనుత్కటములుగా ఉండును. దీని కుదాహరణము కాదంబరి పూర్వ భాగములో ఇలా వున్నది. సప్తచ్ఛద తరవ ఇవ కుసుమరజో వికారైః ఆసన్న వర్తి న్నామ్ శిరః శూలముత్పాదయంతి । ఆ సన్న మృత్యవ ఇవ బంధుజన మపి నాభి జానంతి । ఉత్కీపితలోచనా ఇవ తేజస్వినో నేక్షంతే । కాలదష్టా ఇవ మహామంత్రైరపి, నప్రతి బుధ్యతె । అని.

ఆచార్య వామనుడు కూడ తన ఆలంకారిక గ్రంథమైన "కావ్యాలంకార సూత్రాణిలో"[14] ఈ విధముగానే గద్య భేదములను తెల్పి వాటి లక్షణములను తెలిపియున్నాడు.

ఇటువంటి గద్య విషయములో ఒక ప్రాచీనోక్తి "గద్యం కవీనాం నికషం వదంతి" అని. అంటే కవులకు గద్య రచన ఒక ఒరిపిడి రాయి వంటిది. నికషమనగా ఒరిపిడిరాయి. ఇది సాధారణముగా స్వర్ణ కారుని (కంసాలి) వద్ద ఉండును. అతడు ఈ ఒరి పిడిరాయి మీద బంగారమును రాసి (ఒరిసి) చూసి అది మంచి బంగారమా, లేక నకిలీ బంగారమా యని పరీక్షించి తెలుసుకొనును. అదే విధముగా ఒరిపిడిరాయి యొక్క స్థానములో వున్నటువంటి ఈ గద్యము కవుల ప్రకర్షాపకర్ష స్థానమై వుండి వారి కవితా పటిమను, ప్రౌఢిని తెలుపుచున్నది.

14. వామనోక్తి ప్రకారము గద్య భేదములు :
గద్యం వృత్తగంధి చూర్ణముత్కలికా ప్రాయం చ ।
పద్య భాగవద్ వృత్త గంధి ॥
అనా విద్ధలలిత పదం చూర్ణమ్ ।
[illegible]

ఇదే కాకుండ దీని యొక్క వివరణము ఇలా కూడచెప్పవచ్చును. యథార్థముగా వైజ్ఞానిక మతములో గద్యపద్యములకు ఏయే భేదములనయితే వక్కాణించు చున్నారో దానిని కొంత మంది ఆలోచకులు అంగీకరించుటలేదు. ఎలాగంటే గద్యములో కూడ ఒక ప్రకారమైన ఛందోనుభూతి ఉన్నది. అక్కడ అక్షరగత, మాత్రాగతమైన, నియమములు లేనప్పటికిని స్వరపాతము వలన శబ్దముల యొక్క లఘు గురువుల ఉచ్చారణము చేతను తప్పకుండ ఒక నియమము వున్నది. ఇటు వంటి ఛందోనుభూతియైన ఒక విశేష ప్రకారము గద్యములో లేకున్న అప్పుడు గద్యము శృతి మనోహరముగా ఉండదు. అంటే శృతి కటువుగా ఉండును. కావున పద్యములో ఉన్నట్లే గద్యములో కూడ ఒక రచనా ప్రణాళిక నిశ్చయముగా ఉన్నది. కాని ఈ రచనా ప్రణాళిక చాల సూక్ష్మముగా ఉండును. అందువలన గద్య రచన చేసే కవి దీనిని తెలుసుకొని కావ్యమును రచించినచో నతడు మిక్కిలి ప్రతి భాశాలిగా గణింపబడును. అందువలననే "గద్యం కవీనాం నికషం వదంతి" అనే ఆర్యోక్తి సార్థకమైనది. ఇటు వంటి గద్యము ఏకవిచేత నిర్మింపబడునో అతడే వాస్తవికమైన కవి. ఇటు వంటి గద్య ములోనే కోమల కాంతా పదావళి పద్యముకంటే ఎక్కువగా ఉండును.

ఆర్య జాతి యొక్క సాహిత్యములలో గద్యము యొక్క ప్రథమావతారము సంస్కృతభాషలో ఆ విర్భవించిన దన్న విషయము సహృదయులైన సమస్త సురభారతీ సముపాసకులకు సువిదితమైనదే. వైదిక కాల ప్రారంభము నుండి మధ్య కాల పర్యంతము వరకు గద్య వికాస ఇతిహాసము చాల మనోహరముగా గోచరించుచున్నది. ఎలాగనగా [15] "హ, వై, ఉ" మొదలగు అక్షరములు వాక్యాలంకారార్థము ప్రయోగింపబడుచున్నవి. ఇంక ఉపమా, రూపకాలంకారముల యొక్క కమనీయ సన్ని వేశము చేత విదగ్ధదృష్ట్యా వైదిక గద్యము హృదయా వర్జకముగా వున్నది.

వైదిక సంహితలలో గద్యము యొక్క ప్రాచుర్యము అధికముగా కలదు. గద్య మిశ్రితము చేతనే కృష్ణయజుర్వేదమునకు కృష్ణత్వము ఉపపన్నమైనదని ఐతిహాసికుల అభిప్రాయము. ఈ వేదము యొక్క తైత్తిరీయ సంహితలో అతి ప్రాచీనమైన గద్యోదా హరణములు కనపడుచున్నవి. ఇదే విధముగా అథర్వ వేదము యొక్క ఆరవ భాగములోని పదిహేనవ కాండముగద్యాత్మకముగానే యున్నది.[16]

సమస్త బ్రాహ్మణ గ్రంథముల ఆవిర్భావము గద్య రూపమే. ఇదే విధముగా

---

15. భృగుర్వై వారుణిః వరుణం పితరం ఉపససార అధీహి భగవో బ్రహ్మేతి । (అని తైత్తిరీ యోపనిషత్తులో వాక్యాలంకారార్థము "వై" ప్రయోగము) శ్వేతకేతు ర్హారుణేయ ఆసతం హపితా వాచ శ్వేతకేతో వసబ్రహ్మ చర్యమ్ అని ఛాందోగ్యోపనిషత్తునందు హ అనే అక్షరము ప్రయోగింపబడినది.
16. వ్రాత్య ఆసీదీయ మానేవ స ప్రజాపతిం సమైరయత్ ।
న ప్రజాపతిః సువర్ణాత్మన్న పశ్యత్, తత్ప్రాజనయత్ ।

ఉపనిషత్తులందును, వైదిక సాహిత్యములందును గద్యోపలబ్ధి అధికతరముగా దృగ్గోచరమగు చున్నది. ఐతరేయ బ్రాహ్మణమునందును.[17] వైదిక సాహిత్య గ్రంథమైన శ్రీమద్భాగవతములోని[18] పంచమస్కంధము లోనూ అధికముగా గద్యములు కలవు. దర్శన సూత్ర ప్రణేతల, తద్భాష్యకర్తల సమయములో గద్యలేఖనము అధిక ప్రాచుర్యము పొందెను. అయితే ఆగద్యశైలి దార్శనిక ధారనే అనుసరించెను కాని కావ్య కమనీయత్వమునను సరించలేదు.

పురాణములలో ఉన్నటువంటి గద్య రచనాశైలి వైదిక లౌకిక సంస్కృత గద్యముల యొక్క మిశ్రమమై ఆలంకారికముగాను, ప్రసాదగుణ సంవలితముగా నుండును. శ్రీమద్భాగవతములోను. విష్ణుపురాణములోను[19] ప్రాచుర్యమైన ఉదాహరణములు కనపడుచున్నవి.

అతి పురాతన యుగములో గద్యము యొక్క రూపము ఎలా సరళముగాను రస సహితముగాను ఉండెనో తదుత్తరకాలములో అలంకారాలంకృతముగాను, సమాసబహుళముగాను, శ్లిష్టముగాను ఉండెను. క్రీస్తు శకము ద్వితీయ శతాబ్దములో లబ్ధమైనటువంటి మహాక్షత్రప[20] రుద్రధామ్నుని శిలాలిఖితమైన గద్యము ప్రౌఢా లంకారములతో కూడినదై అత్యంత హృదయావర్జకముగా నున్నది.

ఇక దార్శనికము, శాస్త్రీయము అయిన గద్యములు విశుద్ధమైన సాహిత్య గద్య తుల్యత్వమును పొంది రసపేశలముగాను, సుందర తమముగాను ఉన్నవి. దార్శనికులలో తమ తమ విశిష్టశైలిననుసరించి పతంజలి, శంకరాచార్యులు, శబరస్వామి, జయంతభట్టాదులు తమ తమ గ్రంథ రచనలను చేసిరి.

[21] పతంజలి స్వకీయ మహాభాష్యములో పరిచితమైన విషయములో కూడ ఒక నూతనమూ ఐన వస్తు విశేషమును ప్రదర్శించి గ్రంథరామణీయకత్వమును పెంపొందించెను.

---

17. ఐతరేయబ్రాహ్మణము : "అగ్నిర్వై దేవానామవమో విష్ణుః పరమస్తదంతరేణ సర్వా అన్యాదేవతా । అగ్నా వైష్ణవం పురోడాశం నిర్వపంతి దీక్షణీయ మేకాదశక పాలం సర్వాభ్య ఏవైనం తద్దేవ తాభ్యో నంతరాయం నిర్వపంతి ।

18. శ్రీ మద్భాగవతం: సాంసర్గికో దోషేవ, నూనమేక స్యాపి, సర్వేషాం, సాంసర్గికానం, భవితు మర్హతీతి, నిశ్చిత్య, నిశమ్య, కృపణవ చో, రాజా, రహూగణ,ఉపాసిత వృద్ధోపి, నిసరేణ, బలాత్కృత ఈ షదుత్థిత మన్యు, రవిస్పష్ట బ్రాహ్మతేజసం, జాతవేదసమిద, రజస్యాం హృతమతిరాహ ।

19. విష్ణు పురాణం : "యదైవ ద్యోమ్ని వహ్ని పిండోపం, త్వా మహమపశ్యం, తదైవాద్యాగతో, గతమన్యగతో, భగవతాకించిన్న, ప్రసాదీకృతం, శేషము పలక్షయా మి త్యుక్తే, భగవతానూర్యేణ, నిజకంఠా దున్ముచ్య శ్యమంతకం నామ, మహామణివరమవతార్య ఏకాంతే, న్యస్తమ్ ।

20. ప్రమాణమానోన్మన - స్వరగతివర్ణ - సారసత్వాదిభిః, పరమలక్షణ వ్యంజనైరుపేత కాంత మూర్తినా, స్వయమధిగత మహాక్షత్రపనామ్నా - నరేంద్ర కన్యా స్వయంవరానేక మాల్యప్రాప్త దామ్నా - మహాక్షత్రపేన - రుద్రదామ్నా సుదర్శన తరంకారితమ్ । (రుద్రదామ్నః గిరనారలేఖః)

21. "యేపునః కార్యా భావా నిర్వృత్తౌ తావత్ తేషాం యత్నః క్రియతే । తద్యథా - ఘటేన కార్యం కరిష్యన్, కుంభకార కులం గత్వాహ - కురు ఘటం కార్యం అనేన కరిష్యామి " । న తద్వచ్ఛబ్దాన్ ప్రయు యుక్ష మాణో వైయాకరణకులం గత్వాహ - "కురుశబ్దాన్ ప్రయోక్ష్య" ఇతి। తావత్యేవ - మర్థముపాదాయ శబ్దాన్ ప్రయుంజతే । (మహాభాష్యం పస్పశాహ్నికమ్ )

పతంజలియొక్క ఉదాహరణమును చూచిన వారాలాప భాష ననుసరించి, అదేవిధముగా కథనోప కథనరీతిలో నిబద్ధము చేసినట్లు భాసించుచున్నది. ఆ సమయములో పతంజలి సమీపమున శిష్యులు ఉపవిష్టులైనట్లును, ఆయన వారికి తన సిద్ధాంతమును ప్రతి పాదించు చున్నట్లును ప్రతీయమాన మగుచున్నది.

ఇక ప్రౌఢ మీ మాంసకుడైన శబర స్వామి కూడ సాధారణ శైలితో జైమినీయ సూత్రములకు[22] ప్రసిద్ధమైన స్వకీయ భాష్యమును రచించెను.

వీటన్నింటికంటే పూజ్యులు భగవత్పాదులైన శ్రీ శంకరాచార్యుల గద్యలహరి అత్యద్భుతము. సారగర్భితము, ప్రౌఢము। ప్రాంజలముగానుండును. అందువలననే షట్ దర్శన టీకాకారుడు మైథిల కుల లలామ భూతుడు శ్రీ వాచస్పతి మిశ్రుడు శాంకర భాష్యవ్యాఖ్యాన సందర్భములో మొదట "భాష్యము ప్రసన్న గంభీరము" అని చెప్పెను. శాంకరీ [23] యగద్యములో వీణాధ్వని యొక్క సుమధుర ఝంకారము శ్రవణగోచరమగును. సాహిత్య మాధుర్యములోను ప్రసాదగుణ పేశలమై ఈ గద్యము సంస్కృతము యొక్క సౌందర్యమును ద్విగుణీకృతము చేయుచున్నది.

దీని నుండి ఒక్క వాక్యమును తీసుకొని విస్తృత గ్రంథ నిర్మాణము చేయుటకు శక్యమగును. ఒక్క సార గర్భితమైన వాక్యమును చూద్దాము ః

నహి పద్భ్యాం పలాయితుం పారయ మాణః
జానుభ్యాం రంహితుం అర్హతి

అంటే ఎవడైతే పాదములతో పరుగెత్తుటకు సమర్థుడో వాడు క్లేశ పూర్వకముగా మోకాళ్లతో పరుగెత్తుట శోభించదు.

ఇక ఆచార్యుడైన జయంతభట్టు [24] న్యాయశాస్త్రములో అతి ప్రసిద్ధుడు. ఇతడు ప్రముఖ న్యాయ దర్శనమైన "న్యాయమంజరి" అను పేరు గల ప్రామాణిక గ్రంథమును రచించెను. ఈ గద్యము కూడ అతి సుందరము, సరసము, ప్రాంజలముగా నుండును.

---

22. ఇచ్ఛయాత్మానము పలభామహే। కథమితి? ఉపలబ్ధ పూర్వే హ్యభిప్రేతే భవతీచ్ఛా। యథామేరు ముత్తరేణ యాన్యస్మజ్జాతీయై రనుపలబ్ధ పూర్వాణి స్వాదూని వృక్షఫలాని నతాని ప్రత్యస్మాక మిచ్ఛాభవతి। (జైమిని సూత్రము 1-1-5)

23. నర్వోహి పురోఽస్థితే విషయే విషయాంతర మధ్యవస్యతి, యుష్మత్ప్రత్యయాపేతస్య చప్రత్యగాత్మనోఽ విషయత్వం బ్రవీషి। ఉచ్యతే - నతావదయమే కాంతేన విషయః., అస్మత్ప్రత్యయ విషయత్వాత్ న చాయమస్తి నియమః పురోఽవస్థిత ఏవ విషయే విషయాంతరమధ్యవసితవ్యమితి। అప్రత్యక్షేఽపి హి ఆకాశే బాలాస్తల మలినతాద్య ధ్యవస్యంతి. విషయాంతర మధ్యవసితవ్యమితి!
(బ్రహ్మసూత్ర శాంకర భాష్యము)

24. "అః క్షుద్రతార్కిక। నర్వత్రా నభిజ్ఞోఽసి, బ్రహ్మైవ జీవాత్మనోః నహి తతోఽన్యే। నహి దహన పిండాత్ భేదేనాపి భాంతః స్ఫులింగాః అగ్ని స్వరూపాః భవంతి। తత్ కిం బ్రహ్మణ ఏవా విద్యా? నచ బ్రహ్మణోఽ విద్యా"।

న్యాయదర్శనము అతి కఠినముగా ఉన్నప్పటికి రోచకమైన శైలితో మిక్కిలి హృదయంగమముగా రచింపబడినది. ఇచ్చట వ్యంగ్యోక్తుల నేకములు కలవు.

ఇక సంస్కృత గద్యము యొక్క వైశిష్ట్యమును చూద్దాము. ఈ విషయములో కూడ ఒక ఉక్తి కలదు :-

"వాగ్వైదగ్ధ్య ప్రథానేఽపి రసయే వాత్ర జీవితమ్" అని అంటే పద్య నిర్మితి యందు శబ్దముల యొక్క తారతమ్య భావము ఎంత అపేక్షితము గునో, గద్యమాధుర్యమునకు కూడ అంతే అపేక్షితమగు చున్నది. రమణీయ శబ్దములను రమణీయక్రమముగా స్థాపనమే కవితాస్వరూపము. దీనిని గూర్చిన ఆంగ్ల వాక్యము ఇలాగున్నది.

"Poetry is the best words in their best order" అని.

సాధారణముగా సంస్కృత పద్యములలో నియతాక్షర బంధనోత్పాదితమైనటువంటి సంగీతాను గామినియయిన ఒక విలక్షణమైన గతి మన హృదయములో నిభృతముగా ఒకానొక మాధుర్యమును జనింపచేయును. ఇక్కడ ఛందోనియమం బద్ధమగుటచేత కవి యొక్క కల్పనా శరీరము బలాత్కారముగా అకుంచితము చేయబడును. కాని గద్యములో కవి తన మనోగతములైన సకల భావములను ఛందోనియమములేక యథాభిలాషగా వ్యక్తీకరింపకలుగును. అందువలననే "కావ్యకౌశలం గద్యేనైవ పూర్ణతయా పరీక్ష్యతే" అనే ఉక్తి అన్వర్థమైనది. ఇంక కవి గద్యములో స్వేచ్ఛగా స్వాభిరుచితములైన శబ్దావళిని ప్రయోగించుటకు సమర్థుడగును. స్వచ్ఛమైన దర్పణములో ఎలాసమగ్రమైన వస్తువులు ప్రతి బింబించునో అలాగే గద్య దర్పణమందు కవి యొక్క ప్రతిభ సర్వతో ముఖముగా ప్రతిబింబించును.

ఇక సంస్కృత భాషకు సమాసమే జీవితము. అన్యభాషలలో సమాసకరణము చేత ఏ విచార్యములైన విషయములు దీర్ఘతర - దీర్ఘతమ వాక్యము చేత అభివ్యంజిత మగునో అవి సంస్కృత గద్యములో ఒకే పదము చేత అభివ్యంజనము చేయబడును. అధికార్థముల కొఱకు అల్పాల్పశబ్ద ప్రయోగములు సమాసము చేత చేయబడును. సంస్కృత గద్యములలో ఓజోగుణ మువలన వివిధ భావ గ్రాహితములైన గాఢ బంధము యొక్క సంచారము ఎక్కువగా కనపడును. దీని వలన గద్య సౌందర్యము సంపూర్ణతను పొందు మన్నది. అందువలననే మహాకవి దండి తన అలంకారిక గ్రంథమైన కావ్యాదర్శములో ఓజోగుణ లక్షణమును ఇట్లు పేర్కొనెను:

"ఓజః సమాస భూయస్త్వమే తద్గద్యస్య జీవితం" అని.

ఇటువంటి గద్యము యొక్క సద్భావము ప్రథమ, ద్వితీయ శిలా లిఖితములందు ప్రాచుర్యముగా కనపడును. హరిషేణుడనే కవి యొక్క ప్రయాగ ప్రశస్తి శిలా లేఖనములో విజయస్తంభ వర్ణనా ప్రసంగములో ఇటువంటి విదగ్ధ చాతురీచమత్కృతమైన గద్యము ఉపలబమైనది: "సర్వపృథివీ విజయ జనితోదయ వ్యాప్త నిఖిలావని తలాం, కీర్తి మితస్త్రిదశ

పతి భవన గమనావాప్త లలిత సుఖ వివరణామాచక్షాణ ఇవ భువోబాహురయముచ్ఛ్రితః స్తంభః।" అని.

ఇటువంటి శైలి గద్య కావ్యరచనలలోనే యుండెను, కాని కథనోపకథనము లందులేదు. దర్శనము లందు ఉక్తులచేతను, తర్కముల వలనను, ప్రౌఢగద్యములు ఉపలబ్ధములాయెను. గద్యము లేనిదే యుక్తి యుక్త రూపముగా దార్శనికులు తమ తమ విచారములను ప్రకటించుటకు సమర్థులుకారు. అందువలననే మన దార్శనికులు తమ తమ శైల్యానుసారము దార్శనిక గద్యములను సృష్టించిరి. కోమలభావ వ్యక్తీ కరణలో ఎంతటి శక్తి సంస్కృత గద్యములో ఉన్నదో దాని కంటే అధికముగా దర్శన శాస్త్రములలో దురూహములైన తథ్యములను అభివ్యక్తము చేయునటువంటి శక్తి ఉన్న దటలోని స్పందేహము. లాటిన్ భాషలో నున్నటువంటి గద్యములు అత్యధికమైన ప్రౌఢితోను రస సౌందర్యముతోను, ఓజోగుణ సంవలి తముగాను ఉన్నట్లు విద్వాంసులు నిరూపించుచున్నారు సురభారతీయమైన గద్యము ప్రాచీన దృష్ట్యా, ప్రౌఢతోపాదేయ తాభా వాభివ్యక్తి దృష్ట్యా గౌరవ పూర్ణమైన అంగమును సాహిత్య శాస్త్రములో అందువలననే వహిస్తున్నది.

సంస్కృతవాఙ్మయములో ఎందరో గద్యకవులు విలసిల్లిరి, వారిలో సర్వ ప్రథముడు సుబంధు. ఇతడు "వాసవదత్త" అనెడి కథాగద్యమును రచించెను. ప్రాచీనకాలములో "వాసవదత్త" యనెడి కథ ప్రేమ సంబంధియైనదిగా ఉండెను. కాని ఇతని గద్య కావ్యములో వాసవదత్తతో ఏ సంబంధములేదు. కేవలమా పేరుతో ఈ కథా గద్యమును రచించెను.

ఈ కథ కవి యొక్క స్వబుద్ధి జన్యమైనదే యని సారగ్రాహకులు (సారవేదులు) చెప్పుచున్నారు. ఈ విషయములో "ప్రత్యక్షర శ్లేషమయ ప్రపంచ విన్యాస వైదగ్ధ్య నిధి ప్రబంధమ్" అనే ఉక్తి ప్రసిద్ధిని పొందియున్నది. అంటే ఈ గద్యలోని ప్రతి అక్షరము శ్లేష మయముగా రచించి కవి తన పాండిత్య గరిమను విన్యస్తము చేసి యున్నాడు.

ఈ గ్రంథములో శబ్ద చమత్కారమున్నప్పటికిని అర్థౌచిత్యము అనేక స్థలములందు స్ఖలనమును పొందు చున్నది. ఇదే విధముగా శ్లేష యొక్క ప్రసన్నత కూడ కొన్ని చోట్ల తిరోహితముగా ఉన్నది.

స్వభావముగా ఇతడు శ్లేషకవి యయినందు వలన సభంగ – అభంగ అనే శ్లేషద్వయ ప్రయోగము చేసి విద్వాంసులకు పఠన సమయములో అధిక క్లేశమును కలుగచేసెను. అంటే విద్వాసులు కఠినమైన ఆశ్లేషవైచిత్ర్యము వలన దానిలోని అర్థమును తెలుసుకొనుటకు చాల కష్టపడిరి. దీర్ఘ సమాస యుక్తమైన ఒక పదావళిని చూద్దాము :

"యశ్చ మదకల కలహంస సారస రసితో ద్భ్రాంతభాః కూట వికట పుచ్ఛచ్ఛటా వ్యాధూత వికచ కమల ఖండగలిత మకరంద బిందు సందోహ సురభిత సలిలయా" ।

ప్రసన్న శ్లేషముతో కూడిన కొన్ని వాక్యములు :

"నందగోప ఇవ యశోదయాన్వితః జరాసంధ ఇవ ఘటిత – సంధి విగ్రహః, భార్గవ ఇవ సదా సభోగః, దశరథ ఇవ సుమిత్రోపేతః, సుమంత్రాధి ష్ఠితశ్చ, దిలీప ఇవసుదక్షిణ యాన్వితః, రక్షితగుశ్చ, రామ ఇవ జనితకుశలవ వయోరూపోపచ్చాయః।

ఇతని విషయములో ప్రసిద్ధ కవియైన బాణ భట్టుడు కూడ స్వగ్రంథమైన హర్ష చరితములో "వాసవదత్త" అను ఇతని గద్య కావ్యమును యిట్లు ప్రశంసించెను :

"కవీ నామగల ద్దర్పోనూనం వాసవదత్తయా।
శక్త్యేవ పాండు పుత్రాణాం నూనం వాసవదత్తయా।

ఇక ద్వితీయ గద్య కవి బాణభట్టుడు. ఇతడు మగధ దేశీయుడు. ప్రీతి కూటక నగర వాస్తవ్యుడు. ఇతని కులము పితృ పితామహవంశ పారంపర్యముగా విద్యాస్థానముగా పరిగణింపబడెను. గృహములో నున్నటువంటి పంజరస్థములైన శుకశారి కాదులు కూడ విద్యార్థుల స్ఖాలిత్యములను చెప్పుచుండెడివట. ఇతడు ఈ విషయమును స్వకీయ గ్రంథమైన కాదంబరిలో వర్ణించియున్నాడు.

జగుః గృహే అభ్యస్త సమస్త వాఙ్మయైః।
ససారికైః పంజరవర్తిభిః శుకైః।
నిగృహ్యమాణాః వటవః పదే పదే।
యజూంషి సామానిచ యస్య శంకితాః॥

ఇతని తండ్రి చిత్ర భానుడు. తల్లి రాజ్యదేవి. ఇతడు బాల్యములో స్వేచ్ఛా విహారియై అనువంశికములైన గుణములతోను, పాండిత్యముతోను కూడిన వాడై, శ్రీహర్ష చక్రవర్తి సభయందు సమ్మానితుడై హర్ష చరితము, కాదంబరి అనే గద్య రత్న ద్వయమును రచించెను. ఈ గ్రంథద్వయములు సంస్కృత సాహిత్యములో సర్వోత్కృష్ట ముగ ఇప్పటికిని విరాజిల్లుచున్నవి.

హర్ష చరితములో హర్ష వర్ధనుని చరితము వర్ణింపబడి యున్నది. ఇతడు ఈ గ్రంథములో తత్కాలీన శిల్ప కళాదులను వర్ణించియున్నాడు.

"కాదంబరి" పూర్వార్థము, ఉత్తరార్థము అని రెండు భాగములుగా నున్నది. ఈ గ్రంథములో నున్న పాదవిన్యాస సరణిని వర్ణ నాచాతుర్యమును గ్రహించిన పాఠకులు ముగ్ధత్వమును పొందు చున్నారు. ఈ గ్రంథ కథ జన్మ త్రయవృత్తాంతముతో కూడినది. అంటే చంద్రాపీడ పుండరీకుల జన్మ త్రయముతో సంబంధించి యున్నది. దీనిలో నగర – వన, సరస, పర్వత, ఇత్యాదుల సమస్త వస్తువుల వర్ణనలు ఎంతో హృదయంగమముగా నున్నవి.

ఈ గ్రంథము యొక్క ఉత్కర్షను గూర్చిన శ్లోకము హర్ష చరితములో ఇలాగున్నది :

"నవోఅర్థో జాతిరగ్రామ్యా శ్లేషః స్పష్టః స్ఫుటోరసః ।
వికటాక్షర బంధశ్చ కృత్స్నమేకత్ర దుర్లభమ్ ॥

అంటే అభినవములైన అర్థ పరికల్పనలు, గ్రామ్యదోషరహితములు, స్వభావోక్త్యాది గుణములతో కూడి సులభముగా బోధనాగమ్యములు, శ్లేషాలంకారాన్వితములు, శృంగారాదిరసములు, ఓజోగుణోపేతములు అయిన రచనలు ఒకే చోట అంటే ఒకే గ్రంథములో నుండవు కాని బాణ రచితమైన కాదంబరిలో నివియన్నియు ఉన్నవి.

ఇటు వంటి మహా గద్య రచయిత అయిన బాణుని విద్వాంసులు సరస్వతీ అవతారముగా చెప్పుచున్నారు. ఈ విషయములో నున్నటువంటి శ్లోకము ఈ క్రింది విధముగా నున్నది :

"కాదంబరీరసభరేణ సమస్త ఏవ ।
మత్తో నకించదపి చేతయతే జనోఽయమ్ ॥
ప్రాగల్భ్య మధిక మాప్తుం వాణీ బాణో బభూవేతి ॥

ఇతని గద్య కావ్యమైన కాదంబరి నుండి కొన్నిఅలంకార ప్రయోగోదాహరణములు :

"ప్రావృషమివ ఘనకేశ జాలామ్, శరదమివ వికసిత పుండరీక లోచనామ్"

ఇచ్చట శ్లేష దాని వలన ఉత్థాపితమైన ఉపమా కలిసి స్వర్ణమునకు సౌరభమబ్బి నట్లున్నది.

ఇక తృతీయుడు మహాకవియైన దండి. ఇతని విషయములో ఈ ప్రాచీనోక్తి కలదు:

"జాతే జగతి వాల్మీకౌ కవిరిత్యభిదాఽభవత్ ।
కవిరితి తతో వ్యాసేస్త్వకవయయి దండిని ॥

ఈ సహృదయుల వచనముల వలన సంస్కృత సాహిత్యములో దండికి ఉత్కృష్టమైన స్థానము కలదని తెలియుచున్నది. ఇంక ఇతని విషయములో "దండినః పదలాలిత్యం" అనే ఉక్తి కూడ ఎంతో ప్రసిద్ధిని గాంచియున్నది. ఇతని గద్యము సుభోదముగాను, సరసముగాను ఉండును. అనగా అధిక శ్లేష తోగాని అధిక సమాసబాహుళ్యముతో గాని ఉండదు. శబ్దముల గుంఫనము వ్యావహారికముగా నుండును.

"త్రయో దండి ప్రబంధాశ్చ" అనే ఉక్తి ప్రకారము ఇతడు అలంకారిక గ్రంథమైన "కావ్యదర్శము" "దశకుమార చరితము" "అవంతి సుందరి కథ" అనే గద్య గ్రంథ ద్వయమును రచించెను.

దశకుమార చరితము మహోజ్జ్వలమైన గద్య కావ్యము. దీని యందు హాస్యము, శ్లిష్టము, వ్యంగ్యము మొదలగు నవి హృదయానందకరముగా నుండును. కథా వస్తువు కుతూహలము తోకూడినదై ఉత్సుకతను కలిగించును. ఇందులో నిపాత్రలు సజీవములుగా ఉన్నట్లు గోచరించును.

పదలాలిత్యములో విశ్వవిశ్రుతుడైన కవివరుడు దండి రచించిన దశకుమారచరితములోని కొన్ని చారుతమములైన వాక్యములు ఇట పొందుపరచుచున్నాను :

"అథరాజవాహనో విద్యేశ్వరస్య క్రియా పాటవేన ఫలిత మివ మనోరథం మన్యమానః పుష్పోద్భవేన సహ, స్వమందిర ముపేత్య సాదరం బాలచంద్రికా ముఖేన నిజవల్లభాయై సంగమోపాయం వేదయిత్వా ..... ఇత్య తిష్ఠత్ ।

ఈ విధముగా మహాకవి దండి యొక్క గద్య శ్రీ ఎంతో శోభాయ మానముగా విరాజిల్లు చున్నది.

ఇప్పటికి కూడ సంస్కృత గద్య నిబంధన, దాని సంవర్ధన, పరిష్కరణ, ప్రచారముల లో సురభారతి యందు అనురక్తులైన విద్వాంసులు ప్రయత్నము, చేయుచునే యున్నారు.

అంబికాదత్త వ్యాసుని శివరాజ విజయము, అగస్త్యుడు రచించిన శ్రీ కృష్ణ విజయము, బదరీ నాథయు రచించిన గుణేశ్వర చరితము, నారాయణ శాస్త్రి రచించిన విద్వచ్చరిత పంచకము మొదలగునవి దీనికి నిదర్శనములు.

ఇప్పుడున్నటువంటి గద్యకవులలో గల పరమపవిత్రమైన నిశ్చయమైన పాండిత్యము పురాతనమైన విషయములకు, నూతనమైన అర్థము నిచ్చుటలో సమర్థ వంతముగా గు చున్నది. వీరి గద్యములలో ప్రస్తుతము ఉన్నటు వంటి జగదభి మతమైన వర్ణనాశైలి, విజ్ఞానాను మోదితములైన విచారముల యొక్క మధురిమము, ప్రగతి ప్రియమైన దృష్టి సర్వత్ర సముల్లసితమగు చున్నది.

# ఉపయుక్త గ్రంథ సూచిక


| గ్రంథము | | | |
|---|---|---|---|
| 1. అథర్వవేదము 15వ కాండము 1వ సూక్తము | | | |
| 2. అగ్ని పురాణము | | | |
| 3. ఐతరేయబ్రాహ్మణము | | | |
| 4. కావ్య ప్రకాశము | మమ్మటుడు | | చౌకంబా విద్యా భవన్, వారణాసి |
| 5. కావ్యాదర్శము | ఆచార్య దండి | - | చౌకంబా విద్యా భవన్, వారణాసి |
| 6. కావ్యాలంకార సూత్రాణి | వామనాచార్యుడు | | చౌకంబాసంస్కృత సంస్థానము |
| 7. ఛాందోగ్యోపనిషత్తు | - | | |
| 8. జైమినీ సూత్రము | - | - | చౌకంబావిశ్వ భారతి వారణాసి |
| 9. తైత్తిరీయోపనిషత్తు భృగువల్లి 1వ అధ్యాయము | | | అద్వైతాశ్రమము మాయావతి పితోరగర్ హిమాచల్ ప్రదేశ్ |
| 10. న్యాయమంజరి | జయంతభట్టు | - | చౌకంబసుర భారతి వారణాసి |

11 బ్రహ్మ సూత్రభాష్యము — శంకరాచార్యులు — చౌకంబా ఓరియం టాలియా, వారణాసి

12. మహాభాష్యము పస్పశాహ్నికము — పతంజలి — చౌకంబా విశ్వ భారతి, వారణాసి

13. రసగంగాధరము ప్రథమాననము — పండితరాజ జగన్నాథుడు — చౌకంబా విద్యా భవనము, వారణాసి

14. విష్ణు పురాణము — వేదవ్యాసుడు — నాపల్ ఆర్ట్ ప్రింటర్స్, మదరాసు -14

15. సాహిత్య దర్పణము — విశ్వనాధుడు — మోతిలాల్ బెనారసీ దాస్, వారణాసి

16. శ్రీ మద్భాగవతము 5వ స్కంధము — వేదవ్యాసుడు — రామాయణ ప్రింటిగ్ 10. జి, ఎడ్వర్డ్ ఎలియట్ రోడ్ మదరాసు - 4.

# పాశ్చాత్య కవితావాదములు

ప్రాచార్య యస్వీ జోగారావు

1. సంప్రదాయికవాదము (Classicism)

ఈ మాట పాశ్చాత్య ప్రపంచమున ప్రాచీన గ్రీకు రోమను సాహిత్య సంప్రదాయ సంవాదియైన యొక సాధారణ సాహితీ రీతికి వాచకముగా వ్యవహృత మగుచు వచ్చినది. Aulus Gellius అను నాతడు Scriptor Classicus / విద్యావంతుల సాహిత్యము /, Scriptor Proletarius సామాన్య ప్రజా సాహిత్యం / అనువాని భేదమును నిరూపించుచు మొట్టమొదటగా నీమాటను సాహిత్యపరముగా వాడుక చేసెను. కాలక్రమమున ప్రథమశ్రేణి సాహిత్య మనియు, ప్రాచీన సమయ సంప్రదాయ పటిష్ఠమైన సాహిత్య మనియు నర్థము లేర్పడినవి. పిదప కాలమున ప్రతిస్పర్ధిగా వచ్చిన కాల్పని కోద్యమముతో (Romanticism) పోల్చి చూచినచో దీని పరమార్థము విశదము కాగలదు. ఈ రెంటికి గల వాసి సంగీత చిత్ర శిల్ప నాట్యాది కళలందును, తత్రాది సాహిత్యమునను గుర్తింపగలము. వివిధ కళాపరిణామ చరిత్రను పరిశీలించినచో క్లాసిసిజమ్ రొమాంటిసిజములు ఋతువుల వలె పునఃపునరావృత్తము లగుచునే యున్నవి. ఇవలీ రెంటి యునికిని పరస్పరానుబంధ విరహితమైన కేవలమైన ఏకైక స్థితిలో గుర్తించుట కష్టము. కాని స్థూలముగా వాని స్వరూపము నిట్లు నిర్వచింపవచ్చును. ప్రాచీన సంప్రదాయానుసరణము సమష్టితత్వము, నియమ బద్ధత, మేధోప పన్నత, స్తబ్ధత యనునవి క్లాసిసిజమ్ లక్షణములు. సంప్రదాయ నిరసనము, వ్యష్టితత్వము, నియమరాహిత్యము, హృదయస్పందత, ఆవేగము రొమాంటిసిజము లక్షణములు.

క్లాసిసిజము సమిష్టితత్వము గల దనగా మానవుల మధ్య గల వ్యక్తిగత స్వభావ విభిన్నతలతో గాక సమాన లక్షణములతో ప్రమేయము గలది. ఈ సాహిత్యము నందలి పాత్రలు మౌలిక మానవ స్వభావ ప్రతినిధుల వలె నుండును గాని విలక్షణ విపరీత స్వభావ ప్రతీకలు గావు. సూరనగారి శాలీనుని వంటి కొద్ది పాత్రలు లోకమున మిక్కిలి అరుదుగా కన్పట్టును గాని పెద్దన గారి వరూధినీ ప్రవరులు, శ్రీనాథుని గుణనిధి, సుకుమార, మంచన శర్మలు, గౌరన నక్షత్రకుడు, కలహకంఠీ కాలకౌశికులు, తెనాలి రామకృష్ణుని నిగమశర్మ, రుద్రకవి నిరంకుశుడు, గురజాడ వారి గిరీశం మొదలగు పాత్రల తత్వములు లోకమున అంత అసాధారణములు కావు. చలం గారి పాత్ర లనేకము విలక్షణప్రకృతికములు, రొమాంటిక్ పాత్రల వలె నుండును. రూఢ మూలకములైన సాంఘిక సంప్రదాయములకును సార్వజనీనమైన సన్మార్గమునకును బద్ధముగా నుండుట క్లాసిసిజమ్ లక్షణము. ఈ సంప్రదాయ విధేయత యనునది సహజముగా నొక నియమబద్ధతను, ప్రాచీన ప్రమాణములను ఆశ్రయించి యుండును.

కాల్పనిక సాహిత్యము సమయములను సంప్రదాయములను నిరసించి నిత్య ప్రత్యగ్ర ప్రయోగాత్మకముగ నుండును.

సాహిత్యమున రచనా శిల్పము ప్రముఖమైనదిగా భావించబడునపుడు గ్రంథకర్త సవివరముగా తన పనిని గుర్తుంచుకొని దానిని తన చెప్పుచేతలలో నుంచుకొన వలెను. క్లాసికల్ సాహిత్యమున నీ విధమైన శిల్ప ప్రభావము కన్పట్టును. అందు హృదయస్పందకమైన రసభావ సామగ్రియు నుండును. విలువైనదిగనే పరిగణింపబడును గాని అది సర్వసాధారణముగ నొక నియమపరిధికిని గ్రంథకర్త సాధింపదలచుకొన్న ప్రయోజనము పరిధికిని లోగియుండును. అందుచే నా సాహిత్య మొక్కొక్కప్పుడు చైతన్య రహితమై నిర్జీవముగా గన్పట్టును. మహాభారతము వంటి గ్రంథము లిందుల కపవాదములు. అందలి పాత్ర లనేకము చైతన్య చకచ్చకితములు. అందలి రసగ్రంధు లనుభవాళి వైవిధ్య ప్రతిపాదకములు. ఆ చైతన్యము సనాతనము, అనుభూతి నిత్యనూతనము. కాల్పనిక వాఙ్మయమున రచయిత సద్యోహృద్యమైన రసావేశమునకే ప్రాముఖ్య మిచ్చును. అయితే ఒక్కొక్కప్పుడా యావేశము శ్రుతి మించి మితిమీరి యా వాఙ్మయ మున్మత్త ప్రలాపము వలె గన్పట్టును. క్లాసికల్ సాహిత్యమున వస్తు స్వభావము నందలి శాశ్వత లక్షణములు చోటుచేసికొనును. కాల్పనిక సాహిత్యమున తాత్కాలిక లక్షణముల కెక్కువ తావు గలదు.

ఈ క్లాసికల్ రొమాంటిక్ లక్షణములు ఏకాలపు సాహిత్యమున నైన తలుచు అంతో యింతో కలిసియే యుండును. కాని దేని పాలు హెచ్చినచో దానికి ప్రాధాన్య మిచ్చి ఆ పేర నా సాహిత్యమును వ్యవహరించుట జరుగుచుండును.

ప్రాచీనాంధ్ర సాహిత్యమున భక్తి శతక శాఖలో అందును ధూర్జటి కాళహస్తీశ్వర శతకమున, అన్నమాచార్య త్యాగరాజాదుల సంకీర్తనములలో రొమాంటిక్ లక్షణములు చూడగలము. ఆ కవులందు జేసినది సమిష్టి మానవ మనోభావనకాదు, ఆత్మహృదయ నివేదన. అందు బుద్ధి గమ్యములైన భావముల కంటె హృదయగమ్యములైన రసభావములకే ప్రాముఖ్యము. ఆ భావధార ఆవేగాత్మకమైనది. అందు స్తబ్ధత యన్నది లేదు. ఆ శబ్దప్రయోగము అందు పూర్వ వ్యాకరణోక్త నియమబద్ధత యున్నను, వ్యాకరణ విరుద్ధ ప్రయోగ స్వాతంత్ర్యమునూ గలదు. ఆ నియమరాహిత్యము యక్షగాన, వచన వాఙ్మయశాఖలం దెక్కువ కాననగును. తాళ్లపాక పెదతిరుమలార్యుని వైరాగ్య వచనమాలికా గీతము లందు వచనమునకు గేయమునకు మధ్యస్థమైన రచనా విన్యాస రామణీయకము గలదు. ఆధునిక యుగమున నది యొక నూత్న ప్రయోగ విశేషముగ పరిగణింపబడుచున్నది. కాని అది పూర్వకాలమందే జరిగిన ప్రయోగముగా పెదతిరుమలయ్య రచన బట్టి గ్రహింపగలము. అది 15వ శతాబ్ది నాటి రచన. ఆనాటి కది నూతన ప్రయోగమే. సూరన గారి కళాపూర్ణోదయమున ఆ కథాసంవిధానము నందును, శాలీనాది పాత్రచిత్రణము నందును నవ్యత గలదు. అసలాయన 'చలువగం వెన్నెలం దెలుపునకు సౌరభము దలిర్పన్' ఇత్యాదిగా చేసిన కవితాతత్త్వ ప్రవచనము నందు కాల్పనిక కవితాలక్షణము గలదు. ఆధునికయుగమున కాల్పనిక కవులుగా పరిగణింపబడిన

దేవులపల్లి కృష్ణశాస్త్రి, రాయప్రోలు సుబ్బారావు, శివశంకరస్వాముల కృతులలో ప్రాచీనచ్ఛందో భాషానియమములు, కవిసమయములు అలంకారముల వాడకమున సంప్రదాయచ్ఛాయలు స్పష్టముగా కనవచ్చును. రాయప్రోలు శివశంకర స్వాముల ఇతివృత్తములలో అంత ఆధునికులు. గురజాడ శ్రీ శ్రీల భావనలోను సమిష్టితత్వము లేక విశ్వజనీనత యున్నది. ప్రాచీనులలో పరమ నవ్యుడు, నవ్యులలో అతి ప్రాచీనుడు అయిన విశ్వనాథ సాహిత్యములో క్లాసికల్ రొమాంటిక్ ధోరణులు రెండును సమృద్ధిగా గలవు.

## 2. పునర్నవ సాంప్రదాయిక వాదము (Neo-Classicism)

ఒకనాటి పాత మఱియొకనాటి క్రొత్త. మానవోపజ్ఞమగు భావ సంస్థ ముందునాటి సంప్రదాయపరిధిలో జరిగిన ప్రయోగ క్రమ ఫలితముగా నేర్పడును. కొంతకాలము దనుక నది ఫలప్రద పరిస్ఫూర్తి గలిగి యుండును. అందుచేత నది యొక మంచి పరిపాటిగ రివాజుగ పరిణమించును. అందుచేతనే అది దాని ఫలప్రద పరిస్ఫూర్తిని, శక్తిని గోల్పోయిన పిమ్మట గూడ అర్వాచీనులకు బలవంతపు వారసత్వమై అంత కొంతకాలమునకు నవ భావుకులు కొందఱు నూతన ప్రయోగ సిసృక్షువులై ఆ ప్రాచీన పద్ధతిపై తిరుగుబాటు చేయుదురు. క్రొత్త వింతను, ప్రాత రోతను గొల్పును. ఒక సరిక్రొత్త భావసంస్థ యవతరించును. తత్పూర్వ సంప్రదాయప్రముఖులు గిజగిజ లాడుదురు. గుజగుజలు వోదురు. కొంతకాలమునకా క్రొత్త క్రమముగా ప్రాతపడి, ఆ ప్రాత రోత గొల్పి, ఆ వెనుకటి ప్రాత సంప్రదాయ పరాయణులకు సరేసరి, నవ భావుకులకును రుచి కొల్పి పునర్నవీకృతమై యవతరించును. 17, 18 శతాబ్దులలో ఫ్రెంచివాఙ్మయమునను, ఆంగ్ల వాఙ్మయమునను మఱి యెక్కడగాని యెప్పుడుగాని అట్లవతరించినదే నియోక్లాసిసిజమ్. ఫ్రాన్సులో అరిస్టాటిలు పొయటిక్సు అపార్థములకు గురియైన కాలమున, 1635లో ఫ్రెంచి అకాడమీని ప్రభుత్వము గుర్తించుటతో నీ యుద్యమము బయలుదేరినది. నాటి ఫ్రెంచి వాఙ్మయ వ్యక్తిత్వము క్లాసిసిజమ్ తత్త్వమునే భజించినది కాని యది ప్రాచీన గ్రంథముల కంధప్రాయమైన అనుకరణము కాదు. ప్రాతకే యొక క్రొత్త మలామా. ప్రాచీన విషాదాంతరూపకము లందు బృందగానమున కొక విధాయకమైన ప్రముఖస్థాన మున్నది. నియోక్లాసికల్ విషాదాంతము లందు బృందగానము పరిహరింపబడినది. అవి ప్రాచీన ప్రక్రియలచే ప్రభావితములైనవేగాని మక్కీకి మక్కీ యను కరించినవి కావు. వాని కొక నూత్న వర్చస్వితగలదు. ఈ నియోక్లాసికల్ దృక్పథము ఫ్రాన్సు నుండి ఇంగ్లండునకును ఇతర దేశములకును వ్యాపించినది. ఇంగ్లండున 'రినైసాన్సు' యుగాంతముననే సాహిత్యమున స్వతంత్ర వ్యక్తిత్వము తగ్గుటయు, సంప్రదాయవిధేయత హెచ్చుటయు ప్రారంభమైనది. ఆనాటి కొందరా సాంప్రదాయిక నియమముల యోగ్యతను ప్రశ్నించునే పాటించుచు వచ్చిరి. మఱల క్రమముగా వానిని పాటించవలసిన యావశ్యకతను సహేతుకముగ సమర్థింపజొచ్చిరి. అందులకే ఆ 'రినైసన్సు' తరువాతి కాలమును అనగా 'రెస్టొరేషన్' కాలమును, 18వ శతాబ్దిని నియోక్లాసికల్ యుగము లేక హేతువాదయుగము

(Age of Reason) అనియు నంతతో నాగక ప్రబోధ యుగము (Age of enlightenment) అనియు వ్యవహరించిరి. సాంప్రదాయిక వైదుష్యము, ప్రాచీన సాహిత్యలక్షణ ప్రతిపత్తి, ప్రాచీన సారస్వతానుకరణము, హేతుప్రత్యయబుద్ధి, లోకజ్ఞత (Common Sense) అనునవి ఈ నియోక్లాసికల్ సాహిత్య జీవలక్షణములు. లేనిపోని నూతనోత్సాహములు, హద్దుపద్దులులేని అతిలోక భావనా ప్రపంచమున నేలవిడిచిన సాములు ఆదరపాత్రములు కాలేదానాడు.

ఆంధ్ర వాఙ్మయముననూ ఈ నియోక్లాసికల్ దృక్పథము నీ యాధునిక యుగమున గుర్తింపగలము. ఇంచుమించు 19వ శతాబ్ది చివరిదాక ఆంధ్ర వాఙ్మయ చరిత్రమున కొంత వైవిధ్యము కన్పించినను అదంతయు క్లాసిసిజమొక్కటే వేసిన రకరకాల వాలకములు. ఆంగ్లేయుల పరిపాలనతో పాశ్చాత్య నాగరికతా సాహిత్యముల ప్రభావమును వచ్చినది. మన సాహిత్యముననూ కాల్పనికత వంటి నూత్న భావశిల్ప ప్రయోగ ధోరణులు, ప్రక్రియలు; భావకవిత, అభ్యుదయకవిత, అధివాస్తవికత, వ్యావహారిక భాషాప్రయోగము, నూత్న గేయ చ్ఛందస్సులు, వచన పద్యములు, వచన గేయములు మొదలైనవి ప్రహతముగా సాగినవి, సాగుచున్నవి. ఛందస్సులో, భాషలో, భావములో, దృక్పథములో నూత్న చైతన్యము, సంస్కారము, సంప్రదాయ సాంపరాయము, నియమ నిరసనము, లక్షణోల్లంఘనము - బహుముఖీనముగా కన్పట్టినవి. వ్యాకరణములు సంకెళ్లుగా, నిఘంటువులు స్మశానములుగా, ఛందోబందోబస్తులు సర్ప పరిష్వంగములుగా, ప్రాచీన ప్రబంధములు జీవకళనోరులేని పట్టి కొయ్య బొమ్మలుగా పరిగణింప బడినవి. ఈ బహుముఖీనమైన నవ్యత భవ్యతగానే సంభావింపబడిన దనేక నవభావుకుల చేత. ఉపద్రవము వలె వచ్చిన యీ యుద్యమము చేత ఉక్కిరిబిక్కిరైన సంప్రదాయాధ్వనమును, వారితోపాటు ఈ నూతన సాహిత్య విప్లవవాదుల విశృంఖల విహారము నెడ విముఖత కలిగి సంప్రదాయమునకు మొగ్గిన కొందరు నవభావుకులును సంప్రదాయ ప్రాశస్త్యమును తర్క సహముగా సమర్థించుట కుపపత్తులు వెదుక జొచ్చిరి. నవ్యత నాక్షేపించిరి. అట్టివారిలో ప్రముఖులు 'A Defence of Literary Telugu' రచించిన జయంతి రామయ్యగారు, 'శుక్లపక్ష' కావ్యకర్తలు అనంతపంతుల రామలింగస్వామిగారు, 'సాహిత్య కల' గ్రంథకర్తలు కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు, వారి అన్నగారు బ్రహ్మయ్యశాస్త్రి గారు, 'నేటి కాలపు కవిత్వము' గ్రంథకర్తలు అక్కిరాజు ఉమాకాంతము గారు, పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు, 'ఆంధ్రవ్యాకరణ' మహాభాష్యకర్త వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి గారు, 'ఆంధ్రభాషా వికాస' కర్త గంటి జోగిసోమయాజిగారు, మొదలైనవారును, ఆంధ్ర సాహిత్య పరిషత్పండితులును ముఖ్యులు. వీరు భాష, భావము, ఛందస్సు మొదలగు సర్వవిషయముల సాంప్రదాయిక మార్గమే ప్రశస్తమైనదని కంఠోక్తిగా వాదించిరి. ఎందరో కవులు ప్రాచీన మార్గముననే రచనలు సాగించుచున్నవారు నేటికిని గలరు. విశ్వనాథ వంటి హిటగ్గు లెందరో సాంప్రదాయిక కాల్పనిక మార్గములు రెంటను సమరస భావము గలిగి ప్రజ్ఞను ప్రదర్శించుచున్నారు. ఈనాడు తెనుగున నియోక్లాసిసిజమ్ రొమాంటిసిజములు రెండును ఇరుగుపొరుగుగా కొనసాగుచున్న వనవచ్చును.

3. కాల్పనికవాదము (Romanticism) +

ప్రాచీన ఫ్రెంచి భాషలో Romanz అను శబ్దమునకు లాటినుకు భిన్నమైన గ్రామ్యభాష అని యర్థము. ఆమాట నుండి పుట్టినదే రొమాంటిక్ అను మాట. రోమన్ అను మాట కర్థము వ్యవహారస్థ మగు భాషలో వ్రాయబడిన ఉత్పాద్యేతివృత్తమగు కావ్యము. భాషావిషయికముగను సాంప్రదాయికముల కంటె నీ కల్పనాకృతుల స్వభావము భిన్నమైనది. ఇవి జనసామాన్యమునకు ఆదరపాత్రములైనవి, అనిర్దిష్టాకృతులు, ప్రయోగసాహసశీలములు. రొమాంటిసిజమ్ అను మాట ఈ యర్థమునను ఒక కల్పితకావ్యము నందలి యొక సన్నివేశము లేక మనోవస్థగను 17వ శతాబ్ది ఫ్రెంచి, ఇంగ్లీషు వాఙ్మయము లందు పరిగణింపబడినది. ఫ్రెంచివారు romannesque ను ఊహాపోహాత్మకముగను, విచిత్రమైనదానిగ, అపరిచితమైనదానిగ, రస్యమాన భావాత్మకమైనదానిగ, విషాదాత్మకమైనదానిగను గుర్తించిరి. 18, 19 శతాబ్దుల యందాంగ్లమున నీ రెండవదాని యర్థమే చలామణిలో నుండి అదే ఫ్రాన్సు నందును, జర్మనీయందును ప్రచారము గాంచెను. సర్వత్ర ఈ కాల్పనికోద్యమ కవిత కాక నిర్దిష్టమైన శైలి యేర్పడినది. ఆ కవుల కట్టే జీవితము నెడ నొక నియతదృక్పథ మేర్పడినది.

ఈ కాల్పనికోద్యమము ధనిక సమాజమును నిరసించుచు, మధ్యతరగతి వారిఅవస్థలను, ఆశయములను ప్రతిబింబించుచు బయలుదేరినవి. అందు సాంప్రదాయిక కవితలోని సంయమనము కొఱవడి మానవానుభూతి సహజములైన భావావేశ సంస్పందనములు వినిపించినవి. ఉదాత్త పాత్రలకును, విశిష్ట పాత్రలకును బదులు నీచ, సామాన్య, విలక్షణ పాత్రలీ వాఙ్మయమున చోటుచేసికొన్నవి. బంధుర ప్రబంధశయ్యకు బదులు ప్రజల జీవద్భాషాబంధము; ప్రసిద్ధ పద్యచ్ఛందః ప్రభేదములకు బదులు నూత్న నూత్న వచన గేయరచనా విన్యాసములు, కర్తృనిరపేక్షమైన వస్తుప్రాధాన్యమునకు బదులు కర్తృ సాపేక్షమైన భావ ప్రాధాన్యము, ఆదర్శ భావసంపదకు బదులు అతిలోక భావన, నియతికి బదులు స్వేచ్ఛాతత్వము+ గూడ నిందు చోటు చేసికొన్నవి. ఈ కాల్పనికోద్యమ ప్రభావము వివిధ సారస్వతశాఖలలో కన్పట్టినప్పటికిని దాని ప్రాబల్యము ఆత్మాశ్రయపక్షికమైన గేయశాఖ యందెక్కువ. అడుగడుగున ప్రకృతి యందలి జీవకళను గుర్తించు చూపుతోడి ప్రాపంచిక భావన, ఊహావైహాయస స్వైర విహారముతోడి కళాత్మక భావవ్యక్తీకరణము, ప్రతీకల గాథల (Symbol and myth) వాడకముతోడి రచనా శిల్పము ఈ జాతీ 'లిరిక్కు'ల ప్రధాన లక్షణములు. ఈ కాల్పనికోద్యమ ప్రభావము సాహిత్యము నందే కాదు సంగీత చిత్రకళ లందును పొడ సూపినది. ఒక కళాఖండము నందలి జీవశక్తిగా ఇది ఏ కాలము నందైన నుండవచ్చును. 19వ శతాబ్ది యందు పాశ్చాత్య సాహిత్యమున ప్రముఖస్థానము వహించిన యీ యుద్యమము కాలక్రమమున వాస్తవికతా

---

+ చూడు ఇందలి Classicism & Neo-Classicism ప్రకరణములు

+ సంప్రదాయనిరసనము, ప్రకృత్యుపాసనము, హృదయస్పందకళ మున్నగు లక్షణములు 'మానవుడు సహజముగా మంచివాడే కాని సమాజము వల్లనే చెడిపోవుచున్నాడు' అను రూసో అభిప్రాయము

వాదము (Realism), స్వాభావికతావాదము (Naturtalism), ప్రతీక వాదము (Symbolism) మున్నగు నవ్యధోరణులకు తావిచ్చి తాను సన్నగిల్లినది.

ప్రాచీనాంధ్ర వాఙ్మయమున ధూర్జటి ప్రభృతుల భక్తిశతకము లందును, అన్నమాచార్య క్షేత్రయ త్యాగరాజు ప్రభృతుల పదసంకీర్తనవాఙ్మయ మందును, తాళ్లపాక పెదతిరుమలాచార్యుని వైరాగ్య వచనమాలికా గీతములు, కృష్ణమాచార్యుని సింహగిరి నరహరి వచనములు, ఏగంటి వారి వచనములు, శంకరకవి భవానీ మనోహర వచనములు మున్నగువాని యందు కాల్పనిక కవిత్వచ్ఛాయలు కన్పట్టినవి. కాని అది యొక ఉద్యమముగా మన సాహిత్యమున ప్రభుత్వము సేయుట ఆధునిక యుగమున మన కవికుమారులు చాలమంది ఆంగ్ల కళాశాల లందు షెల్లీ, కీట్సు, బైరను, కాలరిడ్జి, వర్డ్సువర్తు మున్నగు ఇంగ్లీషు కాల్పనిక కవితాప్రవక్తల సరసాంతరంగ సంగీతము లగు కవితలను పాఠ్యములుగ పఠించుటయే గాక హృత్కావితలను జేసుకొని తమ సాహితీసర్గమున వాని ప్రాణకళలను ప్రతిష్ఠించుకొనిరి. ఈ కాల్పనికత గురజాడ ముత్యాలసరాలలో మోసులువారి రాయప్రోలు వారి భావకవితలో మొగ్గ తొడిగి, దేవులపల్లి కృష్ణపక్షము ప్రభృతి రచనలలో మూడు పూవులు నారు కాయలుగా విలసిల్లినది. రాయప్రోలు వారి రమ్యాలోకమున ఈ కాల్పనిక కవితాతత్వ మతి కమనీయముగా ప్రవచింపబడినది –

"కాలధర్మానుగతమై జగత్ప్రవృత్తి మాఱునపుడు వాఙ్మయమును
మాఱు నిజము క్రొత్తనీరు తొల్కారి యేళ్ల క్రుమ్మి పాఱ ప్రాతనీరు
కలంగు టబ్బమ్ము గాదు. చిర యశఃస్థాయి గొనిన ప్రాచీన సుకవి
వాఙ్మయము నందు ఆకర్షవంత మయిన రమ్యభావకలాపమున్,
శ్రావ్య మయిన శబ్దరీతి విధానమున్ సంగ్రహింతు

కాని వారలవలెనె అఖండమైన
సృష్టివైచిత్ర్యమును, ప్రాణిచేతనా వి
కాసమును స్వతంత్రముగ లక్ష్యమున నిలిపి
స్వానుభవ భాష్యములు విప్ప సాహసింతు

ప్రాత గిలిన మాత్రాన భవ్యములుగావు
నవ్యమైన మాత్రాన నింద్యములు గావు
అందచందము లభిరుచి ననుసరించు
దేశకాలపాత్రానువర్తితము లగుట

వాణి వాయింప మ్రోగిన వీణమీద
పారసీక గీతంబులు పలుక మనెనె
ఋషుల నీవారములు ఫలియించినట్టి
పొలములందు గులాబీలు పూయమనెనె

విజ్ఞాన సరస్వతి

సరస చైతన్యరంజిత జగతి యందు
కవి గ్రహింపగరాని వస్తువులు గలవె?

ఇట్లనేక సురుచిర సూక్తిపుంజములం దొక మహోదార్యనికుని వలె తమ కాల్పనికోద్యమ కవితాస్వరూపము సూచముట్టుగ నిరూపించినారు రాయప్రోలు వారు. ఈ కవితామాధుర్యము పరమావధిని జూచినది నండూరి వారి 'యెంకి పాటల'లో భాషలో భావములో ఛందస్సులో పాత్రల తత్వములో సర్వాత్మనా అది కాల్పనిక కవితల యందు కోటికెత్తిన పడగ. పాశ్చాత్య దేశము లందీ తరగతి కవితకు జానపదవాఙ్మయమునను మూలకందముగా చెప్పుదురు.

ఈ కవిల యందు కమ్మని కవ్పేశ్రుతులను తెనుగువారు విన నోచుకొనిరి. కాని అలసులు లఘుసారము నెగబడి పారధ్యము చేయుసరి కిది వెఱ్ఱితలలు వేసినది. కృష్ణ పక్షముపై ఆక్షేప మొక దుమారము వలె లేచినది. అసంతపంతుల వారి శుక్లపక్ష మవతరించినది. భావకవి హాస్యభాజనుడైనాడు. ఇది నియోక్లాసికల్ రియాక్షన్.

యెంకిపాటల గురించి సాహిత్యప్రపంచమున పెద్ద సంచలనమే వచ్చినది. చివరికి పంవాగ్నులలో తపస్సు చేసి సాధించినది యెంకి. ఇవియు నియోక్లాసికల్ రియాక్షన్.

'నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషమా సుధాగాన మంజువాటి ...
దిగిరాను దిగిరాను దివినుండి భువికి'

అని యీ ఆధునిక యుగమున జగత్తు నిండ ప్రగల్భించిన వాస్తవికతను విస్మరించి లేనిపోని మనఃకల్పిత గంధర్వ నగరము లందూహాగానము చేయు భావకవుల నుద్దేశించి –

'పరిగెత్తే మబ్బుల్లారా
ప్రపంచ మిది గమనిస్తారా'

అని హెచ్చరికలు చేసినాడు – అభ్యుదయ కవితా ప్రవక్త శ్రీ శ్రీ. అసలు తానే మారినాడు అతడును పూర్వాశ్రమములో నొక భావకవి వాలకము వేసినవాడే. ఇది రియలిస్టిక్ రియాక్షన్ వాస్తవికతావాద ప్రతీఘాతము.

ఈ ఆక్షేపణలలో తెనుగున కాల్పనికోద్యమమునకు మూలకందమైన భావకవిత యురవ తగ్గినది. కాని కాల్పనికత పూర్తిగా తిరోగమించలేదు. క్రొత్త మలుపులు తిరిగినది. విశ్వనా వంటి విశిష్టుల సంప్రదాయనిష్ఠ యందును అంతర్వాహినియై యున్నది. అస కాల్పనికోద్యమ మెట్టిదనగా అది యొక యుద్యమముగా నొక సాహిత్యమున నొకసా బయలుదేరవలెనే గాని దానికి ప్రాణసంకటము మఱి యుండదు. దినదినగండమైన దీర్ఘాయుష్మగా బ్రదుకగలదు.

## 4. వాస్తవికవాదము (Realism)

జీవిత రంగమున వాస్తవికత నలక్ష్యము సేయరాదు కాని సాహిత్యరంగమున ఆ

కళారంగమున నిది యొక ప్రత్యేక దృక్పథముగ పరిణమించినది. జీవితమును ప్రకృతిని ఉన్నదున్నట్లు నిక్కచ్చిగా ప్రతిబింబింపజేయుటయే కళ యొక్క విధి యని యీ దృక్పథము పరమార్థము. ఇందులకు వర్ణ్య విషయము యొక్క సామాన్యాంశముల కన్న విశేషాంశముల అక్కఱయు, కళాకారుని యొక్క స్వానుభవ భాష్యముకన్న నిష్పాక్షికము ఛాయాచిత్ర సదృశమునైన అన్యూనాతిరిక్తత యొక్క అక్కఱయు నెక్కువ.

ఈ దృక్పథము 18వ శతాబ్ది సాహిత్యము నందే కొద్దిగా పొడసూపినను నిది యొక సాహిత్యోద్యమముగా వర్ధిల్లినది. 1830 నాటి ఫ్రెంచి విప్లవము తరువాత ముఖ్యముగా 1850 తరువాత అసలిది కాల్పనికోద్యమము నందలి రసభావ శిల్పాడంబరవిన్యాసములపై నొక పితూరీవలె వచ్చినది. విజ్ఞాన శాస్త్రము యొక్క పురోగమనము, తర్కసహమైన తాత్విక దృక్పథము దీని అభ్యుదయమునకు దోహదము చేసినవి. వాస్తవికతావాది ఆదర్శవాద ప్రతిపత్తిని, కాల్పనిక రమ్యదర్శనమును కోరి దూరాపాస్తము చేసుకొనెను. జీవితరంగము నందలి సర్వసామాన్యములు, స్వల్పప్రాముఖ్యములు, పాశవిక స్వభావములు నగు పరిస్థితుల చిత్రణము కోసము దేవులాడును. నవల కథానిక మున్నగు సాహిత్య ప్రక్రియలలోను, చిత్రకళ యందును వాస్తవికతావాద మెక్కువ చోటు చేసికొన్నది. ఈ కోవకు చెందిన పాశ్చాత్య నావలికులు - బాల్జాక్, ఫ్లాబర్ట్, హెన్రీ జేమ్స్, లియో టాల్‌స్టాయ్, దస్తాయెవ్‌స్కీ, మార్క్‌ట్వెయిన్ ప్రభృతులు. ఇబ్సెను రూపకములు వాస్తవిక చిత్రణ ప్రకర్ష గలవి.

వాస్తవికతావాదమే శ్రుతిమించి రాగానపడి స్వాభావికతావాదము / నాచురలిజమ్ / గా చలామణియైనది.

సోవియట్ దేశమున 'సామ్యవాద వాస్తవికత' / సోషలిస్ట్ రియాలిజమ్ / అనున దొకటి ప్రాదుర్భవించి పెంపొందుచున్నది. మార్క్స్ సిద్ధాంతమున కది కళారూప ప్రయోగము. కళాస్రష్టను మానవాత్మల కర్ణధారునిగను ('Engineer of human souls'....Stalin) సామ్యవాద సమాజనిర్మాణ పురోగతినే కళ యొక్క ప్రాథమికమైన బాధ్యతగను పరిగణించుటయే దాని తత్త్వము. అలెక్సీ టాల్ స్టాయ్, షొలొఖోవ్, ఫాదెయేవులీ వాద ప్రవర్తకులలో అగ్రగణ్యులు.

ఈ వాదమునకు ప్రతిస్పర్ధిగా 'ఆదర్శవాదము' / ఐడియలిజమ్ / అనునదొక సాహిత్యోద్యమంగా ప్రత్యేకముగా ప్రవర్తితము కాలేదు గాని ఆదర్శదృక్పథము గల సాహితీవ్రతులు ప్రతి దేశమునను ఏనాడు నుందురు. లోకరీతి యథాతథముగ నెట్లున్నదనికాక, లోక మెప్పుడును లోపభూయిష్ఠముగాన మానవ కల్యాణోదర్కముగ నది యుండదగిన ఆదర్శస్థితి యెట్టిదని ఆ స్థితి నూహించి చిత్రించుటయే కళ యొక్క ధ్యేయము కావలెనని వీరి చూపు Utopias అట్లు బయలుదేరినవే.

మన ప్రాచీన వాఙ్మయతత్వము నాదర్శవాదమే పరిపాలించినది. అసలే సాంప్రదాయిక మార్గసాహిత్యమున నైన జరుగున దంతే. కాని ఆ ఆదర్శవాద దృక్పథము సంభావ్య మనిపించుట కక్కడక్కడ ఆ సాహిత్యమునను కొంత వాస్తవిక చిత్రణము నెలకొనియుండును.

అట్లే మన ప్రాచీన సాహిత్యము నందును కొన్ని కథాసన్నివేశములలో, కొన్ని వర్ణనలో, కొన్ని పాత్రచిత్రణలలోను స్వాభావికత గోచరించును. అసలు స్వభావోక్తి యనునదొక అలంకారము మనకు. 'స్వభావోక్తి రసే చారు యథావద్వస్తు వర్ణనమ్' అని దాని లక్షణము / ప్రతాపరుద్రీయము] అనగా వస్తు స్వరూపము నున్న దున్నట్లు చిత్రించుటయే అని యర్థము కాని ఆ స్వాభావికత మనోజ్ఞమైనప్పుడే మన కామోదయోగ్యమని ఆ లక్షణము నందలి 'చారు' శబ్దము తెల్పుచున్నది.

ఆధునిక యుగమున కన్యాశుల్కమున కావలసినంత వాస్తవికచిత్రణ మున్నది. వీరేశలింగముగారి రాజశేఖరచరిత్ర, చిలకమర్తి వారి రామచంద్రవిజయము, పానుగంటి సాక్షి వ్యాసము లందును, చలం ప్రభృతుల నవలలో, పరశ్శతములైన కథానికలలో అనేక సాంఘికరూపకములలో హృద్యమైన వాస్తవికతయే మన కున్నది.

కవితలో ముఖ్యముగా శ్రీశ్రీ ప్రభృతులు అభ్యుదయకవితలో సామ్యవాద వాస్తవికతను గూడ సమృద్ధిగా దర్శింపగలరు.

5. స్వాభావిక వాదము (Naturalism)

19వ శతాబ్ది యుత్తరార్థమున పాశ్చాత్య సాహిత్యమున వాస్తవవికతావాదము పాదునుండి ప్రాదుర్భవించినదీ స్వాభావికతావాదము. భౌతికవాదతత్వము (Materialism), డార్విను జీవశాస్త్ర సిద్ధాంతములు, టెయిన్ నిర్ధారణ వాదము (Determinism) నిందు సంగమించినవి. వాస్తవికతావాదము ఆకృతి యాథార్థ్యముల సామరస్యముతోడి సాహిత్యసిద్ధి గుఱించి యుగ్గడించినది. స్వాభావికతావాదము సామాజిక పరిసర చిత్రణము గుఱించి నొక్కి వక్కాణించినది; మానవస్వభావము నందును బూర్జువా సమాజము నందును గల లోపముల నెత్తి పెట్టినది. 19వ శతాబ్ది వాస్తవికతావాద మొక నిష్పాక్షికమైన యాథార్థ్యము గురించి అన్వేషించినది. స్వాభావికతావాదము తన అధర్మ ఖండనాగ్రహము నందును, సంస్కరణాధినివేశము నందును ఆత్మాశ్రయపక్షికమైనది.

1865 ప్రాంతమున ఫ్రాన్సులో గంకోర్టు సోదరులీ స్వాభావికతా వాదమునకు పునాదులు వైచిరి. రచయితలు ముఖ్యముగా నావలికులు నిశితము, ఉద్రేకపూరితము, సజీవము, సాంఘిక విచారణాత్మకమునైన సాహిత్య ప్రక్రియను చేపట్టవలె ననియు, యథార్థ మనస్తత్వగవేషణము చేసి వారు సమకాలిక నైతికచారిత్రకులు కావలె ననియు, శాస్త్రీయమైన కావ్యశిల్పము యొక్క పద్ధతులు, బాధ్యతలు స్వీకరించవలె ననియు హెచ్చరికలు చేసిరి.

ఎమిలీజోలా ప్రయోగాత్మక నవలాసిద్ధాంతమునకీ హెచ్చరికలు బీజప్రాయములు. అతను తానొక స్వాభావికతావాది ననియు, తన నవల సాహిత్య శస్త్ర ప్రయోగాత్మకమైన శవపరీక్ష వంటి దనియు, పారలౌకికమునైన విషయముల గుఱించిన భావములను సమూలముగ నశింపజేయవలయు ననియు, కంటికి కనిపించు మానవుని యునికి యందలి యాథార్థ్యమే

పరిగణనీయ మనియు, మానవుడు ప్రకృతియొక్క అంతరంగిక విభాగ మనియు, అతని ఇచ్ఛాస్వాతంత్ర్యము భ్రమాస్పద మనియు, పూర్వ పురుషాంతరానుబంధము (heridity), పరిసరము (environment) అను ప్రకృతి మూలసూత్రము లతని వ్యక్తిత్వమును నిర్ధారించు ననియు, అట్టి మానవుడే రచయిత యొక్క వస్తువు కావలె ననియు అతని భావన. 'A work of art is a corner of nature seen through a temperament' / ప్రతి కళాఖండము నొక స్వభావకోటి నుండి దర్శింపబడునట్టి ప్రకృతియొక్క యొకానొక కోణము వంటిది / అని అతని అభిప్రాయము.

ఈ స్వాభావికతావాదము జర్మనీ, స్కాండినేషియా, ఇంగ్లండు, రష్యా, అమెరికా దేశములకును బ్రాకినది కాని యీ శతాబ్ది ప్రారంభదశలోనే పరమ పామరమైన తత్వముగా నిరసింపబడినది.

రష్యను సాహిత్యమున దీని కొక ప్రత్యేక ప్రతిపత్తి కల్గినది. గొగోల్ సాహిత్యమును వ్యాఖ్యానించుచు, కృతకమును అలంకారికమును నైన ఆనాటి కాల్పనికోద్యమమును నిరసించుచు బెలిన్‌స్కీ యీ స్వాభావికతావాదమును లేవదీసెను. రచయితలు జనసామాన్యమును యథార్థజీవితమును చిత్రించవలెననియు, సమకాలికములైన అవినీతులను ప్రకటించవలె ననియు నుద్ఘాటించెను. గ్రిగొరొవిచ్ రచించిన 'దెరెవ్నియా', హెర్జెన్ ప్రాచీన 'క్తో వినొవాత్', తుర్గెనేవ్ రచించిన 'జపిస్కీ అహొటొత్నికా' అను నవలలీకోవకు చెందిన ప్రముఖ రచనలు.

ఆధునికయుగమున మన వాఙ్మయమున అక్కడక్కడ చిక్కపడిన వాస్తవికతయే స్వాభావికతగా మనకు దర్శన మిచ్చును. ఇందులకును వీరేశలింగము, చిలకమర్తి, పానుగంటి, గురజాడ ప్రభృతుల ప్రహసనములు, రూపకములు, వ్యాసములును, చలం ప్రభృతుల నవలలు, కథానికలు, నాటికలును, శ్రీశ్రీ ప్రభృతుల అభ్యుదయ కవితలును తార్కాణలు కాగలవు.

## 6. డాడా వాదము (Dadaism)

ప్రథమ ప్రపంచ మహాసంగ్రామ కాలమున / 1916-21 / జ్యూరిచ్ / స్విట్జర్లాండ్‌లో ట్రిస్టన్ జారా, హన్స్ ఆర్ప్, రిచర్డ్ హూల్‌సెన్‌బెక్, ఏండ్రే బ్రెటన్, లూయీ అరగాన్, జీన్ కాక్టూ మున్నగు రచయితలు కొందరు కలిసి యీ డాడాయిజమ్‌ను ప్రవర్తింపజేసిరి. పసికందు చేయు అవ్యక్త ధ్వనులలో నొకటగు 'డా-డా' అను ధ్వని ననుసరించి దానికి నామకరణము చేసిరి. / ఫ్రెంచి భాషలో ఆ మాటకు ఆటవస్తువగు గుఱ్ఱమని అర్థము సంప్రదాయము సౌందర్యము, నీతి అనువాని విలువ లన్నను; బూర్జువా సంస్థ లన్నను డాడా వాదుల కెనలేని యేహ్యభావము. ఆ పేరుకు తగినట్లు వారి రచనలో అయోమయమైన బాలభాషలో అసుందర భావ వ్యక్తీకరణ వైచిత్రిని ప్రదర్శింతురు. ఆ అందిక పొందికలేని ధ్వనులు ఆ బాలోన్మత్తపిశాచ తత్ప్రలాపములే యాధునిక ప్రపంచ కోలాహలమును, లోకమున వివిధ సంఘటనలు అసంగతముగ ఒక్కపెట్టు జరుగుచుండురీతిని, వివిధ ప్రాణుల సహజీవనము వలన కలుగు గోలాహలమును స్ఫురింపజేయు ననియు అవి యన్నియు మానవ నాగరికత

సాధించిన దానసున్న వైకల్పికతను నిరూపించుననియు వారి వాదము. ప్రమాణము, నియమము, సంప్రదాయము అనునవి లేని విశృంఖల ధోరణి వీరిది. 1920లో జారా, బ్రెటన్‌ల నడుమ వచ్చిన పేచీ మూలముగా డాడావాదము అధివాస్తవికతావాదమునకు చోటిచ్చినది.

## 7. Futurism

20-2-1909 న Paris Figaro లో Manifesto du futurism ప్రకటింపబడుటతో ఫ్యూచరిజమునకు శాస్త్రోక్తముగా జాతకర్మ జరిగినట్లు. దీనికి నామకరణము చేసినవారు, అసలీవాద ప్రవర్తకుడును Filippo Tomosso Marinetti. ఇది యూరపు అంతటను వ్యాపించిన సాహిత్యోద్యమము. ప్రాచీన వ్యవస్థలతో తెగతెంపులు చేసికొన్నది. వస్తువు నందును శైలి యందును యంత్రములు, విమానములు, కార్ఖానాలలో గమన వేగము సాధించిన ఆధునిక యుగ స్వభావానుకూలముగ నూతనరీతుల యావశ్యకత నుద్ఘాటించినది. ఇది మొదట నీష్చే (Nietzsche), సోరెల్, బెర్గ్‌సన్నుల స్వయంనిర్ణయవాదము (Vitalism)తో పరిపుష్టి నందినను మేరినెట్టి విజృంభణముతో వికాసము పొందినది.

'Parole in liberta' అనగా 'శబ్దానికి స్వేచ్ఛ' యనునది యుద్యమ మూల మంత్రము. నియతమైన వాక్యనిర్మాణమునీ యుద్యమాధ్వగులు నిరసించిరి. నామవాచకములు, అసమాపక క్రియలు వీరి రచనలో అర్థానుగుణ్య విరహితముగా కూర్చబడి శ్రేణుల్గట్టి నభోంతరాళమున వ్రేలు చుండును. ఫ్యూచరిస్టు భావధోరణి స్వాభావికతావాద విశృంఖల ప్రయోగసరళి, ఊహాగత రసాయన గణితశాస్త్ర సూత్రసరణి, అర్థరహిత ధ్వన్యనుకరణ మార్గముల సమాహార స్వరూపము.

1909 నాటి ఫ్యూచరిస్టు మేనిఫెస్టో క్రమేపి సాహిత్య కళాధ్వనుల నతిక్రమించి రాజకీయరూపము నవధరించినది. నీష్చే సోరెల్ ల బోధనలను దేశవ్యాప్తము గావింపవలె నను నొక సిద్ధాంతమును రూపొందించినది. యుద్ధ మొక్కటే ప్రపంచరోగమును కుదుర్చు మహౌషధ మని ప్రకటింపబడినది. కడకు ఫాసిజమ్ సంవాదియైనదీ యుద్యమము. ఫాసిస్టు ప్రభుత్వము ఫ్యూచరిజ మొక్కటే ప్రభుత్వము గుర్తించు కళోద్యమముగా ప్రకటించినది. అందుచే అది యెంత కాలమో నిలుకడ కలిగియుండలేకపోయినది. 1924లో మేరినెత్తికి అతని అనుయాయు లందరును నివాళాంజలు లిచ్చిరి.

ఆధునిక నాగరికతా మూలసూత్రములపై అఖండ దండయాత్రలు చేసినప్పటికీ, బాధ్యతారహితమైన మతసంప్రదాయ విశ్వాసవిపర్యాసమును ప్రదర్శించినప్పటికిని ఆనాటి యూరపు సాహిత్యమును ప్రభావితము చేసినది ఫ్యూచరిజము. క్యూబిజము, డాడాయిజము, ఎక్స్‌ప్రెషనిజము, సర్రియలిజముల మార్గము లందిది పురోగతి. ఇది ఇటలీలో అతివాద రాజకీయశక్తుల విజృంభణమునకు మంచి మద్దత్తు నిచ్చినది. రష్యాలో రాజకీయ పరిస్థితుల ఇటలీలోకంటె బహుధా విభిన్నముగ నున్నను అక్కడ తన విపరీత విప్లవధోరణుల కనువైన పరిస్థితులమర్చి పెట్టినట్లున్నవి. గనుక రష్యను సాహిత్యమున చొరవగా చోటుచేసికొన్నది.

రష్యాలో నీ యుద్యమమున రెండు చీలికలు వచ్చినవి – 1. Ego-futurism - దీని నాయకుడు Igor Severyanin. ఇతడు సెంట్‌పీటర్స్ బర్గున అంటే లెనిన్ గ్రాడున తన వ్యాకరణ వైపరీత్యములు, అర్థాతిశాయులైన పదబంధముల ఆడంబరము; విజాతీయమైన ఘుడికారము గల రచనతో వినోదక్రీడ లాడెను. 2. Cubo-futurism - మయకోవస్కీ, ఖ్లెబ్నికోవ్ మున్నగువారి యుద్యమమునకు సూత్రధారులై 1912లో ప్రజాభిరుచి మొగమున గంటువెట్టినట్లు తమ ఉద్యమ పత్ర్యశములో బ్రకటించిరి. ఇది 1909లో నాటి మేరినెత్తి పత్ర్యశమును యథాక్షరముగా అనుకరించినది. అతినూతన పదప్రయోగసాహసము నామోదించినది. ప్రాచీనమైన దానినెల్ల నిరసించినది. గోర్కీ ప్రభృతుల కృతులతో సహా సమకాలిక రష్యా సాహిత్యమును తృణీకరించిరి. అయితే 1917 రష్యను మహావిప్లవము తరువాత మయకోవస్కీ లెనిన్ మహాశయుని ఆక్షేపమునకు గురియై తన ఫ్యూచరిస్టు వాలకమును మార్చుకొనెను.

## 8. సర్రియలిజమ్ (Surrealism) అధివాస్తవికత :

ఇది ఫ్రాన్సు దేశమున ప్రభవించిన ఉద్యమము. అప్పుడే ఉప్పతిల్లి హేతుజ్ఞాన పరిధి కతీతమైన యాథార్థ్యమును నిరూపించుటకు ప్రయత్నించు చుండిన క్యూబిజము, ఫ్యూచరిజము, డాడాయిజము అను దృక్పథముల వైశిష్ట్యమును సూచించుటకుగాను 1918లో Guillaume Apollinaire అను నాయన 'Super-realism' వాస్తవికతను మించినది అను నొక పారిభాషిక పదము నుత్పాదించెను. 'సర్రియలిజమ్' అను మాట కిదియే మూలము. కాని యీ ఉద్యమ పరిణామమునకు మూలకారణము మాత్రము డాడాయిజము. డాడాయిజము సర్వ సంప్రదాయములను, కళాసౌందర్యసూత్రములను నీతినియమములను త్రోసిరాజని విప్లవాత్మకముగా బయలుదేరిన యొక బీభత్సధోరణి. తద్వార ప్రవర్తకులలో జారా, ఏంద్రేబ్రెటన్ అనువారి మధ్య అభిప్రాయభేదము వచ్చి విడిపోయిరి. అందు బ్రెటన్ నాయకత్వమున 1924లో అధివాస్తవికవ్యవస్థ వెలసినది. బ్రెటన్ సుశిక్షితుడైన మనస్తత్వ శాస్త్రవేత్త. అతడు పేరిస్‌లో అధివాస్తవిక తత్వపరిశోధనాగారములను నెలకొల్పి కళాసాహిత్య రంగము లందలి భావ వ్యక్తీకరణ పద్ధతులకు సిగ్మండ్ ఫ్రాయిడ్ (Sigmond Freud) వ్యక్తావ్యక్త (Sub-conscious) మనశ్చైతన్యము గుఱించి జరిపిన పరిశోధనల ఫలితములను సమన్వయించెను. తత్ఫలితముగనే ఒక యాంత్రికమైన రచనావిధానము (method of 'automatic writing') డాడాయిజము నందలి విపరీత విధ్వంసనాత్మక దృక్పథము నమలు జరుపు నుద్దేశము నుత్పన్నములైనవి. 1924లో వెలువడిన మొట్టమొదటి అధివాస్తవికతా పత్ర్యశము (Surrealist manifesto) లో అధివాస్తవికత స్వరూప మిట్లు నిర్వచింపబడినది.

'అధివాస్తవికత యనగా – అంతరంగములో యథార్థముగా జరుగునట్టి భావనా వ్యాపారమును శాబ్దికముగా అనగా వ్రాతరూపమున గాని యితర రూపమున గాని వ్యక్తీకరించుట కుద్దిష్టమైన శుద్ధ మానసిక యాంత్రిక ధోరణి. హేతుజ్ఞాన నియంతృత్వమునకు దూరముగా కళానుభూతి నీతినిరతుల తగులములకు బాహిరముగా మన భావన మన కిచ్చు ఆదేశము.

మనసున మసలు కతిపయ భావచిత్రముల సన్నివేశమునకు సంబంధించిన పరమమైన యాథార్థ్యము నందును, స్వప్నము యొక్క బహుముఖ శక్తి యందును, భావనయొక్క యదృచ్ఛాక్రీడ యందును ఏర్పడు విశ్వాసమే దీనికి మూలము. దానికి మనోయంత్రము యొక్క కడమ వ్యాపారముతో ప్రమేయము లేదు. ప్రధాన జీవిత సమస్యాపరిష్కారమున కిదే వాని స్థానము నాక్రమించును.

దీనినిబట్టి మనము గ్రహించవలసిన దేమనగా - అధివాస్తవికత యనునది దొక కవితారూపము కాదు. ఒక 'రికార్డింగు' యంత్రము వంటిది మాత్రమే. యదృచ్ఛాసంభవ లక్షణము గలిగి యుండుటచేత స్వప్నము సామాన్యమైన, దృశ్యమానజగత్సంబంధియైన వ్యక్తచైతన్యరూపమైన వాస్తవికత కంటె బహుధా విలక్షణమైన అధికతరమైన విశిష్టమైన వాస్తవికతను నిరూపింప సమర్థమైనది. అట్టి స్వప్నతత్త్వముతో తాదాత్మ్యము పొందిన మన భావనావ్యాపారము నుండి అయత్నముగ యాంత్రికముగ బాహిరిల్లుకవితయే నిసలైన పరిశుద్ధమైన కవితయట! ఆంతరభావముల అవిజ్ఞాతత్వము యదృచ్ఛాసంభవత్వమునను లక్షణముల వలన అధివాస్తవిక సాహిత్యస్రష్ట తనుదా కల్పించుకొన్న కట్టికట్టు విద్య నిమగ్నుడైపోవును. చిత్రమైన భావనాయోగసమాధి నుండి అతని రచనలో అర్థరహితములుగా ఉన్నట్టు పదవాక్య గుచ్ఛములు ప్రాదుర్భవించును. ఆ సృష్టి వ్యాపారము ముగిసిన తరువాత గాని వాని ప్రాముఖ్య మంతుపట్టదు. ఏవంవిధ రచనా పద్ధతులద్వారా అధివాస్తవికతావాది వ్యక్త చైతన్యమునకును అవ్యక్త చైతన్య మునకును, బహిరంతర ప్రపంచములకును, నడుమ స్థూలముగను సూక్ష్మముగను నున్న అడ్డుగోడలను పడగొట్టుటకును, నొక లోకోత్తరమైన వాస్తవికతను / సూపర్ రియాలిటీ / నిరూపించుటకును ప్రయత్నించును. ఆ లోకోత్తర వాస్తవికత యందే యథార్థతయు నయథార్థతయు దిధ్యాసయు చికీర్షయు కలసిమెలసి జీవిత చైతన్యస్ఫూర్తిని యావత్తు గుత్తగొనును.

ఈ వాస్తవమైన దృశ్య శూన్య జగత్తున జీవితము, సాహిత్యము బాహాటముగా వ్యక్తమైన బహిశ్చైతన్యమున ప్రవర్తించు నిచ్ఛాశక్తితో మానవుడు కృతకముగా కల్పించుకొన్నవనియు, మనోరంగమున వ్యక్తావ్యక్త చైతన్యపరిధిలో యాదృచ్ఛికముగ, నిరుపపత్తికముగ, అనియతముగ పరిస్ఫురించు అతిలోకములు పరమాద్భుతములు నైన వివిధ భావసన్నివేశములే సామాన్య వాస్తవికతను మించిన వాస్తవికతను నిరూపించు ననియు అధివాస్తవికతావాది యభిప్రాయము. అతడు తన సృష్టిలో నొక స్వాప్నికజగత్తును ప్రతిష్ఠించును. తాత్పర్యమును పాఠకునికే విడిచిపెట్టును. ఆ వ్యక్తావ్యక్తస్థితిలో స్వచ్ఛంద మనః ప్రవృత్తి సహజముగా నెట్టి ప్రేరేపణలు గావించునో తదనుసారము యాంత్రికముగ తోచినది తోచినట్టులు వ్రాయును. కళ, కౌశలము అనునవి కవిని కళాస్రష్టను లొంగదీసుకొనునట్టివి గాన వానికి సంబంధించిన సర్వసిద్ధాంతముల నాతడు నిరాకరించును. తన యసంబద్ధమైన అనిర్వచనీయమైన యూహల మాలోకములోనే మురిసిపోవుచు విహరించుచుండును.

ఈ యుద్యమము ద్వితీయ ప్రపంచమహాసంగ్రామము ప్రారంభదశలో అనుయాయుల మధ్య వచ్చిన రాజకీయ విభేదముల వలన కడబట్టినది. ఇది కళాసాహిత్యరంగము లందు సాధించిన ఘనవిజయము లెవ్వియు లేవు కాని ఆధునికయుగ భావనను చిత్రకళాసాహిత్యము లను కొంత ప్రభావితము చేసినది. సాహిత్యవిషయమున దీని వ్యాప్తి ఫ్రాన్సు దేశమునకు పరిమితమైనది. కాని కళారంగమున దీని పరిమితి అంతర్జాతీయమైనది. యూరపు, అమెరికా ఖండము లందనేక నూతనోద్యమములను ప్రభావితము చేసినది. జీన్ కాక్టో మున్నగు వారిచే నిది సినీమా లందును ప్రయోగింపబడినది. ఒక సరిక్రొత్త విశ్వజనీన సంస్కృతికి పునాదులు వేయుట కది ప్రయత్నించినదని కొందరి భావన.

ఈ ఉద్యమముచే ప్రభావితమైన కళగాని కవితగాని అది యేదో క్రొత్తది గావున కొంతకాలము వింతగొల్పి కొద్దిమంది నాకర్షించినదేగాని ఆ ధోరణిలోని పిచ్చివాని పేలాపన వంటి అయోమయత్వము, అవ్యవస్థ, నియమశూన్యత, విశృంఖలత్వము మున్నగు లక్షణములు ఇంచుక రాసిక్యవాసన గల యెల్లవారికిఁ జేవము గొల్పినవి. సామాన్యవాస్తవికతను మించి యది సాధించిన యా లోకోత్తర వాస్తవికత సిగగోసిరి గాని లేశమైన కళాకౌశలములేని యాకవిత నుండి బ్రహ్మానంద సబ్రహ్మచారి యైన రసానందము పొందదలచుకొన్న మనమేమి బావుకొందుము? హేతుజ్ఞానము చెప్పుచేతలలో నుండి కవులు కావ్యము లల్లుచున్నప్పుడే అందు ముక్కాలు మువ్వీసముగ కాగితము బరువేకాని కౌశలము బరువు కానరాకున్నవి. అట్టిచో ఆ కళ, కౌశలము అను మాటల పొడ గిట్టనివారి హేతుజ్ఞానమున కతీతమైన భావభారమును రస ప్రసువునకు నిసువుల మగు మన మెట్లు మోయగలము? అసలా అంతర్లోక లోకోత్తర వాస్తవికతను సాధించితి మనుకొనువారి రచనలలో నెంత ఆత్మవంచన గలదో ఎంత జగద్వంచన గలదో ఎవరి కెరుక?

## 9. ప్రతీకవాదము (Symbolism)

ఫ్రాన్సు దేశమున ఉత్పన్నమైన సాహిత్యోద్యమ మిది. 18-9-1886 తేదీన Jean More' as తన Le Figaro లో ఈ నామకరణము చేసినాడు. ఫ్రెంచి సాహిత్యము వాడీ యుద్యమ ప్రవర్తకులు Verlaine, Laforgue, Rimbaud, Mallarme. వారు కర్తకు కర్మకు నడుమను, బహిరంతః ప్రపంచములకు నడుమను నున్న ఎడము నుజ్జగించిరి. వారు కవిలోను కవి వల్లను అస్తిత్వము నందు విశ్వము గురించి యొక యాధ్యాత్మిక దృక్పథము నవలంబించిరి. ఆదర్శవాదులై యొకానొక సౌందర్య మతమునకు ప్రవక్తలైరి. ఈ నశ్వరమైన దృశ్యమానజగత్తు మిథ్య యనియు, అవాఙ్మానస గోచరమగు పరతత్వము యొక్క ప్రతిబింబమే యనియు, విభిన్నములైన యింద్రియముల ద్వారా కలుగు ప్రేరణల నడుమ నొక సంవాద మున్నదనియు వీరి విశ్వాసము. అందుచే ఈ ప్రతీకవాదులు అశాశ్వత జగద్విషయకములగు వాస్తవికతా, స్వాభావికతావాదముల శిల్పములై తిరుగబాటు చేసిరి. అంతరమైన శాశ్వతమైన సత్యస్వరూపము కొన్ని ప్రతీకలద్వారా సూచ్యము కావలసినదేకాని వాచ్యము కారాదని వారి యుద్దేశము.

అందులకుగాను ఒక యింద్రియ సంబంధమైన భావముద్ర యింద్రియాంతర భావముద్రగా పరిణమించి రెండును మూలభావ ముద్రకు ప్రతీకలగు నందాక సంక్షిప్త వాక్య శిల్పము ద్వారాను, ఒక ప్రధాన రూపకాలంకారమును పరివేష్టించిన చిన్న చిన్న భావచిత్రగుచ్ఛముల ద్వారాను రచనలో గాంభీర్యమును, మసృణత్వమును సాధించవలెను. ఈ ప్రతీక ప్రక్రియ యొక్కొక్కప్పుడు పట్టి సామాన్యమైనదిగా కన్పించును కాని తరచు ఉద్దేశపూర్వకముగనే అస్పష్టముగను ఆ మార్గానుయాయులకు మాత్రమే అర్థమగునట్టివిగను కన్పట్టును. అయితే ఈ ప్రతీకవాదులు మాత్రము తమ కవిత సంస్కారుల కినుప గుగ్గిళ్లుగాను, తమ మార్గానుసారులకు పడుకటింటి పాటగాను ఉండుటచే హర్షింతురు. ఇక మరియొకమాట - వీరు తమ పద్యములలో ప్రతి శాబ్దిక విన్యాసము యొక్క శ్రవణపేయత్వమున కెక్కువ ప్రాముఖ్య మిత్తురు. అసలా పద్యము లాపాత మధుర మగు సంగీతము వలె చదువరుల హృదయ విపంచికలపై ప్రతిధ్వనింప వలెనని వీరి ఆశయము. అందుచే లయ హొయలు గల శ్రావ్యములైన సంవిధాన సులభములైన ఛందోరీతులను సృజించుకొనిరి. మధురశబ్ద శ్రవణమాత్రమున అబోధపూర్ణములగు భావ స్థిర జనసాంతర సౌహృదములు తమ పాఠకులకు స్ఫురింపవలెనని కాబోలు వీరు తమ సాహిత్యమున సంగీతాంశ గురించి యంత అభినివేశమును జూపిరి. 'Poets are rythmic beings' అను ఆభాణకము వీరిపట్ల సార్థకము.

వీరికి సాంఘికములు, నైతికములు నగు కావ్యవస్తువులు సాక్కావు. సాంఘికము నైతికము నైన బాధ్యతతో నిమిత్తములేకుండనే కళ యన్నది సౌందర్య రిరంసను కలిగియుండునని వీరి నమ్మకము. అతి సున్నితములైన కవుల అంతఃప్రేరణల (intuitions) నందుకొన గలిగినచో నది యెట్టి వస్తువైనను ఎట్టి వ్యక్తిగత భావదర్శనమైనను వీరి కభ్యంతరములేదు. వీరు 'కళ కళకొఱకే' అను సిద్ధాంతము నామోదించిన వారి వలె తోచును. ఈ ఉద్యమము సాహిత్యజగతి కొక మేలు చేసినది. గతానుగతికములగు వస్తువులనే స్వీకరింప వలసిన యవసరములేకుండ రచయితలకు నూతనమార్గమును నిర్దేశించినది. అంతేకాదు వ్యాఖ్యానాపేక్ష గల ప్రతీకను సంగీతాత్మతో అనుసంధించి ప్రయోగించు నొక నూత్న రచనాశిల్పము నుత్పాదించినది. ఈ శిల్పము వలన నీ సాహిత్యములో భావనావ్యాపారమున కవి కెంత వెసులుబాటుండునో పాఠకుని కంత వెసులుబాటుండును. ఆ పద వాక్యవిన్యాస ప్రతీకలు సదృశభావాంతర సాహచర్యమున ఉద్దిష్టార్థ ప్రతీతిని కలిగించును. వివిధ ధ్వనివిశేషగర్భితములుగ స్వతంత్రార్థ సంకేతములు నిర్దేశించబడిన శబ్దసంయోజనముతో నీ సాహిత్యమున నొక సరిక్రొత్త కవితాభాష యేర్పడినట్లైనది. ఈ ఉద్యమము నాటి యూరపు కవితా స్వరూపమును చాల మార్చివైచినది. మామూలుగ ప్రతీకవాదులుకాని కవుల రచనాశిల్పమున గూడ ప్రతీకవాదకము నందలి విశిష్టలక్షణము, భావక్లిష్టి ప్రవేశించి యొక విప్లవాత్మకమగు పరిణామమే వచ్చినది. అయితే ఏమాట కామాట చెప్పుకోవలె - ఈ ప్రతీకల గడబిడ వలన సామాన్య పాఠకుని బోధశాలితకా కవిత్వము దూరముగా బోయినది.

ప్రాచీనకాలము నుండియు మత వేదాంత శృంగార విషయములగు కవితలలో నొకవిధమైన ప్రతీక వినియోగలక్షణ మున్నది. కాని దానికిని యీ ఆధునికమైన ప్రతీక వాదమునకు గల సంబంధ మంతంత మాత్రము. అది విప్రకీర్ణము, ఐచ్ఛికము. ఇది యొక యుద్యమముగా ప్రవర్తిల్లినది. ఇందు ప్రతీక ప్రతిష్ఠ నియతదృక్పథము మీదను, సామయిక వినియోగము (Conventional use) మీదను ఆధారపడి యున్నది.

ఈ ప్రతీకవాదమునకు Expressionism లో గాఢమైన అనుబంధము కలదు. అసలు జర్మను దేశమున ప్రతీకవాదము పొందిన పరిణతరూపమే Expressionism.

## 10. అభివ్యక్తివాదము (Expressionism)

ఫ్రెంచి ప్రతీకవాద పరిణామముగా జర్మను దేశమున మొదటి ప్రపంచ సంగ్రామమునకు కించిత్పూర్వము వెలసి 1924 వరకు సాహిత్య చిత్రలేఖన కళారంగము లందు వర్ధిల్లిన యుద్యమ మిది. ఆనా డటు ఇటలీలో Futurism విప్లవపూర్వదశ యందు రష్యాలో Cubo-Futurism అమలులో నున్నవి. ఈ యుద్యమము ఇంగ్లండు అమెరికాలలో కొన్ని నవ్యోద్యమములను, సర్రియలిజమును గూడ ప్రభావితము చేసినది.

1901లో హెర్వేఅను ఫ్రెంచి చిత్రకారుడీ మాట నుపయోగించెను. 1914లో హెర్మన్ బహర్ అను ఆస్ట్రియన్ రచయిత దీనిని సాహిత్యమునకు సమన్వయించెను. వర్ణ్యవస్తువుల బహిస్స్వరూపనిరూపణము కంటె వాని మౌలికమైన వాస్తవికతను వ్యక్తీకరించుట యీ ఉద్యమ ప్రధానాశయము. అందులకే ఆపేరు. ఇది యానాటి కళారంగమునను, అసలు పైని బడారము లోనటాడారముగా నున్న నాగరికత మీదనే యొక తిరుగుబాటుగా వచ్చినది. ఈ యుద్యమ సాహిత్యతత్వము బెర్గ్‌సన్ తాత్వికదృక్పథము చేతను, Husserl ప్రతిపాదించిన Intutive phenomenology చేతను, దస్తొయెవ్‌స్కీ స్ట్రిండ్‌బర్గుల మానవాత్మ తత్వగవేషణము చేతను, ఫ్రాయిడ్ యొక్క వ్యక్తావ్యక్త సాంకేతికతా వ్యాఖ్యాన వైఖరిచేతను ప్రభావితమైనది. వర్ణ్య వస్తు స్వరూపము నందలి ప్రముఖ లక్షణముల వైకల్య వికృతులపై నాధారపబడియున్నది దీని పరమార్థము. ఈ సాహిత్య తత్వము అద్భుతావహముగను భావోద్వేగబంధురముగను, ఒక్కొక్కప్పుడు పాఠకులను చకితులను జేయు నిగూఢ భావ ప్రగాఢముగను నుండును. ఆ రచన కూడ వింతగా విద్యుద్వేగముగా శీఘ్రగతితో పిచ్చెత్తినట్లు సాగును. ఒక్కొక్కప్పుడు తంతివార్త వలె, గద్యపద్యము వలె నుండును. అందు సద్వ్యార్థకములు, విరుద్ధార్థకములు నగు పదబంధముల ప్రయోగాతిశయము గూడ కన్పట్టును. అందలి భావవ్యక్తులు నిర్జీవ ప్రకృతిలో ప్రాణకళను ప్రతిష్ఠించును. మానవు నొక నిర్జీవ యంత్రముగా నిరూపించును. వస్తునిర్వహణమున వాస్తవికతయు పరమ వాస్తవికతయు యథేచ్ఛగా మేళవింపబడును. వాస్తవికత యొక అమానుష వికృతితో దర్శనమిచ్చి గ్రంథకర్త యాశించిన ఫలితమును సాధించును.

ఈ ఉద్యమ ప్రవర్తకులు ననుయాయులు నైనవారిలో ముఖ్యులు - Kafka, Franz Werfel, Fritz Von Unruh, Georg Kaiser, Georg Trakl, Silesian Heym, James Joyce.

T. S. Eliot ల గ్రంథము లందును ఈ యుద్యమ ప్రభావమును గుర్తింపగలము. వీరిలో కొందరిలో ఒక నైరాశ్యదృక్పథము, కొందరిలో ఒక సత్వర విప్లవాకాంక్షయు గోచరమగును. విభిన్న దృక్పథములనుబట్టి యీ ఉద్యమాధ్వనీనులలో మూడు తెగలు కన్పట్టును. సాంఘిక రాజకీయ సంస్కారణము వాంఛించు అభ్యుదయ కాముకులైన యోజనాశీలు రొక తెగ; వ్యక్తికి జాతితో గల యనుబంధములో ప్రమేయము పెట్టుకొన్నవా రొక తెగ; మానవునికి దేవునికి సంబంధించిన సమస్యల గురించి యాలోచించువా రొక తెగ.

అనుయాయులలో గల యీ విభేదములు కారణముగ ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరము 1924లో జర్మనీలోను యూరపులోను పరిస్థితుల కొక నిలుకడ గలిగినంత ప్రపంచశాంతి సౌభ్రాత్రముల గురించియు, సామాజిక విప్లవము గురించియు నందరును కన్న కలలు కరగిపోయినంత యీ యుద్యమము కనుమరుగినది. జర్మనీలో హిట్లరు అధికారము నాటుకొనగానే యీ Expressionists చాలమంది ప్రవాసముల పాలైరి. కొందరు మాత్రము హిట్లరు గారి నాజీతత్వమునే సమాశ్రయించిరి. నాజీజము గూడ వస్తు విషయమున వీరితో విభిన్నవైఖరి నవలంబించినది గాని Expressionism యొక్క బహిస్స్వరూపలక్షణములను కొన్నిటి నాదరించినది.

## 11. భావముద్రావాదము (Impressionism)

ఫ్రాన్సు దేశములో 1856 నాటి గంకోర్టు సోదరుల జర్నల్‌లో నుదాహరింప బడిన ఇంప్రెషనిస్టు రచనలనుబట్టి వారే యీ ఉద్యమ ప్రారంభకులుగా భావింపబడిరి. ఇది చిత్రలేఖనము, సంగీతము, సాహిత్యము మూడింటను ప్రవేశించిన ఉద్యమము. ప్రేక్షకులను, శ్రోతలను, పాఠకులను ఆయా కళాస్రష్టల యొక్క అనుభూతిని స్వయముగ పునస్సృష్టించు కొనుటకై ప్రేరేచుట దీని ప్రధానలక్షణము. అవును కవిహృదయసంవాదియైన అనుభూతిని పొందుటయే గదా సహృదయలక్షణమని మన అలంకారికులన్నారు 'యేషాం కావ్యానుశీలోవశాత్ ...' అనాటి వాస్తవికతా స్వాభావికతావాదములు దీని సృష్టి స్థితులకు, కారణభూతములైనవి. ప్రతీకవాదమునను, పునర్నవ కాల్పనికోద్యమమునను నిది లయము చెందినది.

ఈ ఇంప్రెషనిజము సాహిత్యశిల్పమున భావముద్రలను నమోదు చేయు సాధనముగా భాష నుపయోగించుట కొక నియతమైన పద్ధతి గలదు. ఆ పద్ధతి నిర్వహించుట యందు రచయిత బాధ్యతలు కొన్ని గలవు - వర్ణ్య విషయముల గురించి పెద్ద శ్రద్ధాసక్తులతో ఆలోచన సేయరాదు. వర్ణ్యవిషయ స్వరూపమును సమగ్రముగా నవగాహన చేసికొనుటకై ఆత్మీయతా పరిమార్జనము చేయవలెను. సర్వాత్మనా ఆవిధముగ అనుశీలితమైన వర్ణ్య విషయము యొక్క స్వభావ జీవలక్షణములతో నంవదించు పదబంధములను సంయోజింప వలెను. అట్టి పదబంధములతో పాఠకుల జ్ఞానేంద్రియ సంస్కారములపై భావముద్రలు వేయవలెను. వారు తన యనుభూతిని పంచుకొనునట్లు చేయవలెను.

సాహిత్య రంగమున ఈ 'ఇంప్రెషనిస్టులు' అను మాటను సలవోక పేలముగా ప్రతీక వాదులు, భావచిత్రవాదులు (Imagists), చైతన్యస్రవంతి శిల్పవాదుల (writes of the stream of consciousness technique) పరముగను వాడుట కద్దు. అసలు వీరి రచనా పద్ధతి యేమనగా – జ్ఞానేంద్రియ సన్నికర్షమున నేర్పడిన యనుభూతి యొక్క సద్యోభావముద్రను ఎట్టి సంశ్లేష విశ్లేషములకు గురిసేయక యథాతథముగ దాని బహిఃస్ఫుటత్వ మెటులుండునో అట్టు సవివరముగ ప్రదర్శింపజేసినచో ఆ తటిత్తళత్తళ కక్షరాకృతి నిచ్చుట వీరి ధ్యేయము. తమ కావ్య వస్తువు నందలి కీలక భావస్వరూపమును విశదీకరింపరు, అవిష్కరింపరు. అసలు సహృదయపాఠకుని హృదయస్పందనము నెడ వీరికున్న ఆసక్తి కావ్య వస్తువు నందు లేదు. 19వ శతాబ్దాంతమునను, 20వ శతాబ్దారంభమునను నుండిన ఇంప్రెషనిస్టులు - Bourgets, Maetorlink, Thomas Mann ప్రభృతులు ప్రకృతి యెడల నొక నూత్న దృక్పథము నుత్పాదించిరి, మానవానుబంధములలోని సున్నితపు భావగ్రంధుల నన్వేషించిరి.

Rimbaud, Verlaine, Mallarme, Valeny, Hopkins, T. S. Eliot, James Joyce, Virginia Woolf మొదలగువారు ఇంప్రెషనిస్టులుగా పరిగణింపబడిరి.

## 12. భావచిత్రవాదము (Imagism)

చిత్రముగా ఈ భావచిత్రవాదము 1909-17 సం॥ల నడుమ ఇంగ్లండునను అమెరికా యందును కాలక్షేపము చేసినది. ప్రతీకవాదముచే బహుధా ప్రభావితమైనను వర్ణ్యవిషయముల కొక విశిష్ట రూపకల్పన చేసి విస్పష్టరేఖలతో వివరించుట దీని ప్రత్యేకత. ఈ భావచిత్రవాదులు సిసలైన వాడుకభాష నుపయోగించుటకు, క్రొత్త లయలను సృజించుటకు, వస్తువిషయమున పరిపూర్ణమైన స్వేచ్ఛను పాటించుటకు నుత్సహింతురు. రచనలో మసృణత్వమే కవితకు ప్రాణ మని వీరి అభిసంధి. ప్రతీకవాదుల భావవ్యక్తుల కన్న వీరిని స్పష్టప్రతిపత్తి నధికముగా కలిగియున్నను వీరి కవితలు తరచు వారి కవితల కంటెను దురవగాహములుగా నుండును. కారణములు వీరి భావవ్యక్తి ఒక ఆవేశముతోగాని అర్థముతోగాని విశదమైన అనుబంధము కలిగియుండకపోవుట, కవితలోని మసృణత్వము భావ వైశద్యము కొరవడి భావమును సూచించి సూచించనట్లుండుట. అందుచేతనే దీనికి అయోమయకవిత్వ మనియు పేరు వచ్చినది. వీరు తమ పద్ధతి అల్ప పరిధీకృతమై పోయినదని త్వరలోనే గ్రహించి, తమ పద్ధతిని తామే నిరసించుకొన్నట్లు తాదృశముగా కవిత చెప్పుట విరమించుకొనిరి. అయినప్పటికి ఈ శతాబ్ది కవితా సరస్వతి కది విశిష్ట వరివస్య చేసినదనియే చెప్పవచ్చును. ఆధునిక జీవితము నందలి కళాత్మకమైన విలువలమీద వీరికున్న ప్రగాఢవిశ్వాసమే వస్తుస్వేచ్ఛ నతిమాత్రముగా ప్రోత్సహించినది. అలంకారప్రాయముగా గాక అర్థవంతముగా నున్న శబ్దములనే ప్రయోగించవలెనను వీరి అభినివేశమే ప్రతీకవాద కవితలోని నిస్సారవైఖరిని అధిగమించినది. క్రొత్త లయంపై వీరికి గల మోజే పద్యరచనలో స్వేచ్ఛకు దారితీసినది. కాని యొకవంక పద్యబంధ బంధురతను నిలువరించుటకు ప్రయత్నించినది. క్రొత్త లయయే క్రొత్తభావమున కస్తిత్వ మన్నట్లుగా

వీరు పద్యరచనా స్వాతంత్ర్యమున కాక గౌరవస్థానము చేకూర్చిరి.

ఈ భావచిత్రవాదమున కాద్యప్రవర్తకులు ఫ్రెంచికవులైనను, ఈ వర్గములో ప్రసిద్ధముగా వినిపించునవి - టి. ఇ. హుల్మే, రిచర్డు ఆల్డింగ్టన్, హిల్డా డూలిటిల్, జాన్ గౌల్డ్ ఫ్లెచర్, ఎఫ్. ఎస్. ప్లింట్, ఎజ్రాపౌండు, అమీ లోవెల్. ఆంగ్లదేశమున దీనికి ఎజ్రా పౌండు 1912లోనే సారథ్యము వహించెను. కాని 1914లోనే అతడు దీనినుండి తప్పుకొని 'వోర్టిసిజమ్' అను నొక ఆదర్శవాదమునకు సమకట్టెను. కాని భావచిత్రవాదమున కంటె ప్రత్యేకమైన వ్యక్తిత్వములేక అతడే కాకియై పోయినాడు. అసలీ భావచిత్రవాదమునకు పితామహుడు హుల్మే. కాల్పనిక వాదమును కాదని అల్పాక్షరములలో అన్యూనాతిరిక్తమైన అర్థ శిల్పమును సాధించగల కవితా ప్రక్రియ కావలెనని ఉద్ఘాటించినా డాయన. ఇది ప్రతీకవాదము మీద కూడ ఒక విధమైన తిరుగుబాటు ఉద్యమము. ఫ్యూచరిజమ్, క్యూబిజమ్ మొదలగు సమకాలిక కవితోద్యమములను గూడ నిరసించినట్టిది. కవిత యొక్క అంతరార్థముల మీద కంటె బహిరాకృతి బంధురత మీదనే దీని దృష్టి.

The Imagist Credo 1915 లో వివరింపబడిన వీరి పరమాశయముల నిట్లు సంగ్రహముగా క్రోడీకరింపవచ్చును.

1. సామాన్య వ్యావహారికభాషయే వినియుక్తము కావలె. అందును అలంకారప్రాయమైన శబ్దజాలము పనికిరాదు, అచ్చమైన మామూలు మాటయేగాని.
2. నూత్న నూత్న మనోవస్థలకు తగినట్లు నూత్నలయలను కవులు సృజించవలె.
3. వస్తు స్వీకరణమున సంపూర్ణ స్వాతంత్ర్యము వహించవచ్చు.
4. భావచిత్రములకు రూపకల్పన సేయవలె. కవితలో అస్పష్టమనోజ్ఞములైన సాధారణ విషయముల కంటె విశిష్టవిషయముల యథావద్వస్తు వర్ణనయే ఉపాదేయము.
5. అర్థ పుష్టి, స్పష్ట వ్యక్తి కవితాజీవాతువులు కావలె.
6. మసృణత్వమే కవితకు ప్రాణము.

ప్రథమ ప్రపంచసంగ్రామానంతరము భావచిత్ర వాద ముత్పన్నమైనది. ఈ శతాబ్ది ప్రారంభదశలో ఆంగ్ల-అమెరికను కవితా రంగంలో నున్న అయోమయత్వముపై విప్లవ ధ్వజ మెత్తిన యుద్యమమిది. కాని యీ వాదము కవితకు కండ పట్టయిన భావసామగ్రత మనః పరికల్పనా మార్గమునకు శ్రుతి కలుపలేక కాలకూలంకషాగర్భమున మునుకలు వేసినది.




SVUORI LIBRARY 188803

# VIJNANA SARASWATI

A Half Yearly Oriental Reasearch Journal in Telugu

*The Andhra Pradesh Government*

*Oriental Manuscripts Library & Research Institute.*



Chief Editor

**Dr. V.V. Krishna Sastry, M.A. Ph.D.**

Director

**The Andhra Pradesh Government**

Oriental Manuscripts Library &

Research Institute, Hyderabad - 1

**Volume** 6

**Number** 2

July - December

1989